ఊరింతల
కేరింతల ఉయ్యాల
న్యూట్రిన్
మిఠాయిల జంపాల

Nutrine Confectionery Co. Ltd. Chittoor (A.P.)
Caramel bar
Caramel bar
nutrine
fruitrine
mint bar
nutrine
mint bar
coffi toffi
nutrine

పిక్నిక్కి మిఠాయి యందు
ఫలరస పూరిత విందు!

CAS NC 55/81 TEL A




న్యూట్రిన్

న్యూట్రిన్ కన్ఫెక్షనరీ కంపెనీ లిమిటెడ్, చిత్తూరు-517 002 (ఆం.ప్ర.)

సీతాకోకచిలకా, సీతాకోకచిలకా, రావే రావే
నన్ను చూడు, నాతోటనిచూడు, పూలని చూడవె రావే
సీతాకోకచిలకా, యిదిగో జెమ్స్ యివి నీకోసం
నీకోసం, మరి నాకోసం, మన అందరికోసం






చేజిక్కించుకోండి ఆ మధుర క్షణాల్ని
చేజిక్కించుకోండి ఆ జెమ్స్‌ని!

క్యాడ్‌బరిస్ చాక్లెట్లు

పువ్వులన్నీ సుగంధాన్ని పంచుతాయి, క్యాడ్‌బరిస్ జెమ్స్ తియ్యదనాల్ని అందిస్తాయి

OBM/6742/TL

# నాణ్యత కొండెత్తు...వెల వీసమెత్తు.

అముల్‌వారి న్యూట్రముల్. అదే, శ్రేష్ఠతకు హామీ. పరిపుష్టమైన కోకో. హితకరమైన అముల్ పాలు. ప్రశస్తమైన మాల్టు. అతి ముఖ్యమైన విటమిన్లు, ఖనిజాలు. మరి సాటిలేని ఆ శక్తి కారక లక్షణాలు. ఇవన్నీ మీకు మిగత వాటికన్న ఇంచుమించు 4 రూపాయలు తక్కువ వెలకు! న్యూట్రముల్ వస్తాదుగా అవండి... ఆ తేడా ఆనందించండి.

మిగతవాటికన్న ఇంచుమించు 4 రూ. చవక!

ఇటువంటి ఆహార పానీయాల ధరల పోలిక (రూ.)*
నాన్ ఫ్లెక్సిబుల్ ప్యాకేజింగ్

| | 500 గ్రాం. | 800 గ్రాం. | 1000 గ్రాం. |
|---|---|---|---|
| న్యూట్రముల్ డబ్బా | 13.83 | – | 26.67 |
| మాల్టోవా సీసా | 17.58 | – | – |
| బోర్న్‌విటా డబ్బా | 17.68 | 26.97 | – |
| బూస్ట్ సీసా | 18.87 | – | – |

*మార్చి '81లో కొనుగోలుదారుల గరిష్ఠ ధర. స్థానిక పన్నులు అదనం.











మార్కెట్ చేసేవారు:
గుజరాత్ కోఆపరేటివ్ మిల్క్ మార్కెటింగ్ ఫెడరేషన్ లిమిటెడ్. ఆనంద్. 388001.

daCunha/81/GCM/53/TL

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ ["సేనాని ఎన్నిక"] కు ఆధారం బొమ్మిడి అచ్చారావు రచన.

సాధారణంగా ప్రతిమనిషికీ వుండని విశేషశక్తులు కలవాణ్ణి, నలుగురికి కీడు చేయడానికిగానీ, లేక మేలు కలిగించడానికిగానీ ఎలా ఉపయోగించవచ్చో, "అపూర్వనయనాలు" అన్న కథలో తెలుసుకుంటాం.

## అమరవాణి

ఉదారస్య తృణం విత్తం, శూరస్య మరణం తృణమ్,
విరక్తస్య తృణం భార్యా, నిస్పృహస్య తృణం జగత్.

[దానం చేసేవాడికి ధనం, శౌర్యం కలవాడికి మరణం, వైరాగ్యం కలవాడికి భార్య, కోరికలేని వాడికి జగత్తు—గడ్డిపోచవలె లెక్కలేనివి.]

సంపుటి 70 జనవరి '82 సంచిక 1

విడి ప్రతి : 1–75 : : సంవత్సర చందా : 21-00




CHITRA



# చంద్రహారం

ఒక రాత్రివేళ తలుపు గట్టిగా చప్పుడవడంతో, చంద్రం ఉలిక్కిపడుతూ నిద్రలేచాడు. బయట వానవచ్చే సూచనగా మెరుపులతోపాటు, గాలి తీవ్రంగా వీస్తున్నది.

చంద్రం తలుపు తెరవగానే ఒకావిడ హడావిడిగా లోపలికి వచ్చి, "త్వరగా తలుపు మూసెయ్యండి. వాళ్ళిటే వస్తున్నారు," అన్నది.

ఆమె ఖరీదైన పట్టుచీర ధరించి వున్నది. మెడ నిండుగా నగలున్నవి. చంద్రం ఆమె మాటలకు ఆశ్చర్యపోతూ, తలుపు మూసేంతలో, ముగ్గురు మనుషులు ఇంటి ముందుగా పరిగెత్తుతూండడం అతడి కంటబడింది.

"ఎవరు మీరు? వాళ్ళు, మీ వెంట ఎందుకుపడినట్టు?" అని అడిగాడు చంద్రం.

ఆ సరికి ఇంట్లోకివచ్చినఆవిడ ఆయాసం నుంచి కొంచెం తేరుకుని, "వాళ్ళు, నా నగలకోసం వెంటబడ్డారు. బంధువుల ఇంటికి పెళ్ళికి వెళ్ళి, మధ్యలో తలనొప్పి రాగా, బాడుగ బండిలో ఇంటికి బయలుదేరాను. దారిలో ఇద్దరు బండిని అటకాయించారు. బండివాడు కూడా తోడుదొంగే! అదృష్టం కొద్దీ, వాళ్ళను తప్పించుకుని రాగలిగాను," అన్నది.

ఇంతలో పెద్ద పెట్టున వర్షం ప్రారంభమైంది. చంద్రం ఆమెతో, "ఈ వర్షంలో వెళ్ళడం, అంత మంచిదికాదు. తెల్లవారి వెళుదురుగాని," అని మధ్య గదిలో మంచం మీద ఆమెకోసం పరుపుపరిచి వచ్చాడు.

చంద్రానికి కృతజ్ఞతలు చెప్పుకుని, ఆమె గదిలోకి వెళ్లిపోయింది. ఆ తరవాత చంద్రానికి చాలా సేపటివరకూ నిద్ర

మాచిరాజు కామేశ్వరరావు

పట్టలేదు. కొంచెం నిద్రపట్టి మెలుకువ వచ్చేసరికి, బారెడు పొద్దెక్కింది. అతడు గది నుంచి బయిటికి వచ్చాడు. ఎదురుగా వీధితలుపు బార్లా తెరిచివున్నది.

చంద్రానికి గుండె ఝల్లుమన్నది. అతడు తలుపు మూసి, లోపలి గదిలోకి వెళ్ళి చూశాడు. రాత్రి వచ్చినావిడ లేదు! కాని, మంచం పక్కన బల్ల మీద ఆమె తాలూకు చంద్రహారం వున్నది. అతడు నిర్ఘాంతపోయాడు. ఎంత లేదన్నా నాలుగు వేలు ఖరీదు చేసే చంద్రహారం అది.



ఆ క్షణంలో చంద్రానికి పెళ్ళినాటి నుంచీ భార్య భాగ్యం పెడుతున్న గొడవ గుర్తుకు వచ్చింది. ఆమెకు చంద్రహారం కావాలి. అయితే, అతడికి అది చేయించే స్తోమతులేదు. ఈ రాబోయే దీపావళికి చంద్రహారం చేయించాలని పట్టుపట్టిందామె. చంద్రం తనవల్ల కాదంటే కాదన్నాడు.

అంతకు ముందు రోజు అతను కచేరీ నుంచి తిరిగి వచ్చేసరికి, "నా మాట మీద నీకు ఏమాత్రం లక్ష్యం లేదు. చంద్రహారం చేయించేదాకా, మళ్ళీ యీ గడప తొక్కను," అన్న ఉత్తరం వదిలి భార్య పుట్టింటికి వెళ్ళిపోయింది.

రాత్రి దొంగలబారి నుంచి తప్పించుకు వచ్చిన ఆవిడ, చంద్రహారం అక్కడ ఎందుకు వదిలిపోయిందో, అతడికి ఎంత ఆలోచించినా అర్థం కాలేదు.

హఠాత్తుగా వీధిలో నుంచి భార్య గొంతు వినిపించి అతడు అటుకేసి తల తిప్పాడు. ఏ కారణం వల్లనో భాగ్యం త్వరగా తిరిగి వచ్చింది. ఇప్పుడు యీ చంద్రహారం చూస్తే, తనకోసం చేయించినదనుకుంటుంది. నిజం చెప్పినా నమ్మదు. హారాన్ని ఏదో విధంగా రాత్రి వచ్చినావిడకు తిరిగి యిచ్చివేయాలి!

చంద్రం యిలా అనుకుని, హారాన్ని వంట గదిలో వున్న బొగ్గులబస్తాలో వేసి, అది బాగా అడుగుకు పోయేలా, బస్తాను బాగా కుదిపాడు. ఆ బొగ్గులబస్తా మాసం



గడిచేవరకూ ఖాళీ అవదు. ఈ లోపల అది భార్య కంటబడే అవకాశమే వుండదు.

చంద్రం వెళ్ళి తలుపు తెరవగానే భాగ్యం విసుగ్గా లోపలికి వస్తూ, ''బారెడు పొద్దెక్కినా, ఏమిటా నిద్ర? సంక్రాంతి కయినా చంద్రహారం చేయించాలి, తెలుసా. అందుకే వచ్చాను.'' అన్నది.

పుట్టింట వదినెతో పోట్లాడి వచ్చిన సంగతి ఆమె భర్తకు చెప్పదలచలేదు. చంద్రం భోజనంచేసి, కచేరీకి వెళ్ళి పోయాడు. వంటగది శుభ్రం చేస్తున్న భాగ్యం, చిన్న తేలొకటి బొగ్గుల బస్తాలోకి పోవడం చూసింది. వెంటనే ఆమె బస్తాను బోర్లా కుమ్మరించి, తేలును కర్రతో కొట్టి చంపేసింది.

బొగ్గుల్ని తిరిగి బస్తాకు ఎత్తుతూండగా ఆమె కళ్లు జిగేలుమన్నాయి. బొగ్గుల మధ్య తళతళ మెరుస్తున్న చంద్రహారం! ఆమె హారాన్ని పమిట కొంగుతో తుడిచి, మెడలో వేసుకుని గొప్పగా మురిసి పోయింది.

బొగ్గుల దుకాణంలో ఎలాగో చేరిన చంద్రహారం, తాము తెచ్చుకున్న బస్తాలోకి వచ్చింది. ఈ సంగతి భర్తకు చెపితే, అయన యిక తనకు చంద్రహారం చేయించడు. దాన్ని సంక్రాంతి వరకూ భర్త కంటబడకుండా దాచాలి! ఆయన చంద్రహారం చేయించాక, యీ హారాన్ని కరిగించి, గాజులు చేయించుకోవచ్చు.

అంతకాలంపాటు హారాన్ని భర్త కంటబడకుండా దాయడం ఎలానా అని కొంచెం సేపు ఆలోచించి, భాగ్యం దాన్ని ఒక డబ్బాలో పెట్టి, దాని మీద పుట్టింటి నుంచి తెచ్చుకున్న సున్నిఉండలు వేసింది. తరవాత దాన్ని తీసుకుపోయి, తనకు తోడుగా వచ్చి, ఆ రోజే తిరిగి పోతున్న తన పుట్టింటి ఊరి వాడికిచ్చి, భద్రంగా తన తల్లికి చేర్చమన్నది.

అతను ఆ సాయంత్రానికల్లా ఆ ఊరు చేరి భాగ్యం వాళ్ళ ఇంటికి వెళ్ళాడు.

సమయానికి భాగ్యం తల్లి ఇంట లేదు. వాడు డబ్బాను భాగ్యం వదినెకు ఇచ్చాడు. ఆమె డబ్బా మూత తీసి, సున్ని ఉండలు చూసి, అడబడుచు వాటిని తిప్పి ఎందుకు పంపిందా అనుకుంటూ, వాటిని పక్కకు జరిపింది. తళుక్కుమంటూ చంద్రహారం మెరిసింది.

"ఈ పిల్ల దేవాంతకురాలే! అత్తగారింటి నుంచి అన్ని అమ్మగారింటికి చేరవేస్తున్నది. తగినశాస్తి చేయాలి." అనుకుంటూ వదినె హారం తీసుకుని, సున్ని ఉండల డబ్బా అత్తగారి గదిలో పెట్టేసింది.



తరవాత భర్త నరహరి ఇంటికి రాగానే, చంద్రహారం అతడికిచ్చి, "పనికిమాలిన ప్రశ్నలడక్కు! పట్నం వెళ్ళి, దీన్ని కరిగించి, మరొక కొత్త నగ చేయించుకురా!" అన్నది.

నరహరికి భార్య మాటంటే, సుగ్రీవాజ్ఞ. అతడు తెల్లవారుతూనే పట్నం చేరి, ఒక పెద్ద నగల దుకాణానికి వెళ్ళి, చంద్రహారాన్ని కరిగించి, మరొకరకం హారం తయారుచేసి యివ్వమన్నాడు. దుకాణం వాడు నరహరి ముందు యితర నమూనాల హారాలు వుంచాడు. నరహరి వాటిని చూస్తున్నంతలో, రక్షకభటులు యిద్దరు వచ్చి, నరహరిని పట్టుకున్నారు. దుకాణం అతనే తన మనిషి ద్వారా వాళ్లకు కబురు చేశాడు.

"దొంగిలించిన హారాన్ని కరిగించాలని చూస్తున్నావా? ముందు కచేరీకీ, తరవాత ఖైదులోకీ, ఊఁ పద," అన్నారు రక్షకభటులు, నరహరి రెక్క పట్టుకుని.

నరహరి గుడ్లు తేలవేసి, "ఇది నేను దొంగిలించింది కాదు, నా భార్య యిచ్చింది," అన్నాడు.

రక్షకభటులు అప్పటికప్పుడు అతణ్ణి తీసుకుని వాళ్ళ ఊరు వెళ్ళారు. నరహరి భార్య వాళ్లను చూస్తూనే కెవ్వుమని, "ఆ హారాన్ని పట్నం నుంచి, మా ఆడబడుచు పంపింది," అన్నది.

రక్షకభటులు ఆవిణ్ణి కూడా వెంట బెట్టుకుని, భాగ్యం యింటికి వెళ్ళారు. ఆమె వణికిపోతూ, "అది నాకు బొగ్గుల బస్తాలో దొరికింది," అని చెప్పింది.

రక్షకభటులు బొగ్గులు దుకాణం వాడి దగ్గిరకు బయలుదేరుతూండగా, చంద్రం వాళ్ళకు జరిగిందంతా చెప్పి, "ఇది దొంగసొమ్ము కాదు, ఆ సంపన్నురాలే మా యింట మరిచిపోయింది," అన్నాడు.

ఇదంతా పెద్ద గందరగోళంగా తోచి, రక్షకభటులు ఏమి చేయడమా అని ఆలో చిస్తూండగా, ఇంటిముందు గుర్రపు బండి ఆగింది. అందులో నుంచి చంద్రహారం యజమానురాలు దిగి, వాళ్ళ దగ్గిరకు వచ్చి, రక్షక భటులతో, "చంద్రహారం ఎవరూ దొంగిలించలేదు; వీళ్ళ యింట్లో మరిచిపోయాను. ఇక మీరు వెళ్ళవచ్చు," అన్నది.

వాళ్ళు వెళ్ళిపోగానే చంద్రం ఆమెను, "అసలు హారాన్ని మా ఇంట్లో ఎందుకు వదిలి వెళ్ళారు?" అని అడిగాడు.

"ఆ రాత్రి నేను పడుకున్న మంచం పక్కన బల్ల మీద, మీ భార్య పుట్టింటికి పోతూ రాసిన ఉత్తరం చూశాను. నా భర్త కోటీశ్వరుడు. ఇలాంటి హారాలు మా కొక లెక్కలోవి కాదు," అంటూ చంద్రహారం ఆవిడ, భాగ్యంకేసి తల తిప్పి, "కొన శక్తి లేని భర్తను నగలు తెమ్మని వేధించడం, ఏ ఇల్లాలయినా చేయదగిన పనేనా? భర్త మంచితనం, ఆదరణా అన్నిటికంటె ముఖ్యం. ఇక రక్షకభటుల భయం లేదు. నేను బహుమతిగా యిస్తున్నాను, యీ హారం తీసుకో," అని చంద్రహారాన్ని భాగ్యానికి యివ్వబోయింది..

భాగ్యం సిగ్గుతో తల దించుకుని, "మీరు ఒకటి రెండు చక్కని నీతివాక్యాలతో, నా కళ్ళు తెరిపించారు. ఆడంబరాల కోసం యిన్నాళ్లూ భర్తను బాధ పెట్టాను. నన్ను ఎంతో ప్రేమాదరాలతో చూసుకునే, నా భర్తే నాకు వెలలేని చంద్రహారం!" అంటూ హారాన్ని తీసుకోడానికి నిరాకరించింది.






## 3

[నిరాయుధుడైన రాజు మందరదేవుణ్ణి బంధించి సముద్రతీరం కేసి తీసుకుపోతున్న ద్రోహులిద్దరూ, హఠాత్తుగా పిడుగుపడి మరణించారు. తరవాత మందరదేవుణ్ణీ, అతడి వెంట వున్న సైనికులనూ కుండలినీ ఆశ్వికులు ముట్టడించారు. అప్పుడు జరిగిన పోరాటంలో ఆశ్వికులలో చచ్చిన వారు చావగా మిగిలినవారు కోటవైపుకు పరుగెత్తారు. తరవాత—]

మందరదేవుడి ముఖలక్షణాలను బట్టి, ఆయన ఏదో దీర్ఘాలోచనలో వున్నాడని సైనికులు గ్రహించారు. ఆయన ఒకమారు సముద్రం కేసీ, కోట కేసీ చూసి పెద్దగా నిట్టూర్చాడు.

సైనికులు తమ రాజును అంతగా కలవరపరుస్తున్న సంగతి ఏమిటా అనుకునేంతలో మందరదేవుడు యిలా చెప్పాడు:

"మనం ఈ రాజ్యాన్ని ఎంత త్వరగా వదిలిపోతే అంతక్షేమం. చావుదెబ్బలు తిని పారిపోయిన ఆ కుండలినీ అశ్వికులు, మనను గురించిన వర్తమానం వాళ్ళ నాయకుడికి తెలియబరుస్తారు. ఆ తరవాత వాళ్ళు ఇనుమడించిన బలగంతో మనను ముట్టడిస్తారు. ఈ చిన్న పడవలలో, యీ మహాసముద్రం మీద బయలుదేరి కానని ద్వీపాలకేసి మనం




యుద్ధప్రకటన లాటి రాజధర్మాన్ని కూడా పాటించకుండా, హఠాత్తుగా నా రాజ్యం మీద దాడిచేసి వశపరుచుకున్న నరవాహన మిశ్రుడిని ఏనాటికైనా హతమార్చటం తప్ప, నాకు మరో జీవితాశయం లేదు. కాని మీరు.........భార్యాబిడ్డల్ని, బంధు వర్గాన్ని....''

''మమ్మల్ని పట్టివుంచే అలాంటి బంధనాలేమీ మాకు లేవు, మహారాజా!'' అన్నారు సైనికులు.

మందరదేవుడు సైనికుల కేసి వాత్సల్యం వుట్టిపడేలా చూసి, ''ఐతే, యిక మనం జాగుచేయటం మంచిది కాదు. మరికొందరు శత్రుసైనికులు రాక ముందే, పడవలెక్కండి,'' అంటూ వారిని హెచ్చరించాడు.

పడవలు రెండూ తెడ్ల సహాయంతో అల్లకల్లోలంగా వున్న సముద్రంలోకి నడపబడినై. అసరికి తుఫాను కొంత శాంతించింది. ఉరుములూ, మెరుపులూ కూడా తగ్గిపోతున్నై. వానజల్లు మాత్రం వుండి వుండి పడుతోంది. సూర్యుడు అస్తమించాడు. అన్నిదిక్కులా కమ్ము కుంటున్న దట్టమైన కారుచీకటిని పున్నమి చంద్రుడు, సముద్ర తీరాన వున్న గుబురు చెట్లల్లోకీ, సముద్ర గర్భంలోకీ తరిమే స్తున్నాడు.

పోవలసి వుంటుంది. ఏ క్షణాన ఏ ప్రమాదం మనను చుట్టుముట్టుతుందో తెలీదు. మీ నలుగురు కూడా నాతోపాటు యీ ద్వీపాన్ని వదలదలుచుకున్నారా?''

అందుకు సైనికులు నలుగురూ ఏక కంఠంతో, ''మహారాజా! మేం యింత కాలంగా మీ ఆశ్రయంలో బతికినవాళ్ళం. కష్ట సమయంలో మిమ్మల్ని విడిచి పోయేంత విశ్వాస ఘాతకులం కాదు,'' అన్నారు.

మందరదేవుడు సైనికుల రాజభక్తిని మెచ్చుకుంటూ యిలా అన్నాడు:

''నేను మీ రాజభక్తిని శంకించటం లేదు. నా వరకు నేను అవివాహితుణ్ణి.

పడవలు సముద్రంలోకి చాలా దూరం వెళ్లినై. ఎటు పోతున్నాం? ఎక్కడికి పోతున్నాం? అన్న ఆలోచన ఎవరికీ కలగలేదు. నరవాహనమిత్రుడి చేతికి అందకుండా వున్నంతవరకూ, ఎక్కడికి వెళ్ళినా ఒకటే అన్నట్టు భావించారు మందరదేవుడూ, అతడి వెంట వున్న సైనికులూ.




సముద్రంలో నాలుగైదు గంటల ప్రయాణం తరవాత వారికి దూరంగా మినుకు మినుకుమంటూ అలల మీద తేలియాడుతున్న కాంతి కనిపించింది. ఇంత తుఫానులో, చేపలు పట్టేందుకు అంత దూరం సముద్రంలో ప్రయాణించే పల్లెవాళ్లు ఎవరూ వుండరు. ఐతే, ఒక వేళ అవి తమను పట్టుకునేందుకు వెంబడిస్తున్న నరవాహనమిత్రుడి నావలు కావు కదా?

ఈ సంశయం, భయం కలిగిందే తడవుగా మందరదేవుడు పడవలో లేచి నిలబడ్డాడు. మినుకు మినుకు మంటున్న దీపాల కాంతి క్రమక్రమంగా అటుకేసే వస్తున్నది. బాగా పరీక్షించి చూసిన మీదట అవి అంత పెద్దవి కాని రెండు పడవలని మందరదేవుడు గ్రహించాడు.

"అల్లకల్లోలంగా వున్న యీ సముద్రం మీద మరో యుద్ధం తప్పక పోవచ్చు. ఆ దీపాల కాంతి, మనలాగే తప్పుకు పారిపోతున్న మన దేశపు పడవలదైతే ఫరవాలేదు. అలా కానప్పుడు అవి కుండలినీ నావలే అయి వుంటవి," అని సైనికులకేసి చూసి, "మనలో ఎవరి దగ్గరా విల్లంబులు లేవు గదా?" అని అడిగాడు మందరదేవుడు.

సైనికులలో ఒకడు వెంటనే ఇలా జవాబిచ్చాడు:

"మహారాజా! మన దగ్గర ఖడ్గాలు తప్ప మరేం లేవు. మహామంత్రి మమ్మల్ని నలుగురనూ, మీ రక్షణకు పొమ్మన్నప్పుడు—వున్నవాళ్లం వున్నట్టు బయలుదేరాం.

"ఫరవాలేదు," అన్నాడు మందర దేవుడు. "మరాళదేవి కరుణా, మన చేతి పదును కత్తులూ మన రక్షణకు చాలు! ఒకవేళ మరణమే తప్పని సరయితే—ప్రాణం పోయింతరవాత యీ శరీరం సముద్రగర్భంలో చేపలకు ఆహార మైతేనేం? భూగర్భంలో క్రిమికీటకాలకు ఆహారమైతేనేం? ఏదైనా ఒకటే!"

మందరదేవుడి యీ మాటలు సైనికు లకు ధైర్యాన్ని కలిగించినై. అంతలో దూరంగా మినుకు మినుకు మంటున్న పడవలు దగ్గర దగ్గరకు రాసాగినై. బాగా కనుచూపు దూరంలోకి వచ్చేసరికి — ఆ పడవలలో నుంచి ఒక దీర్ఘకాయుడు ధనుస్సు చేబూని లేచి నిలబడ్డాడు.

చంద్రకాంతిలో అతడి ముఖకవళి కలు సరిగా కనిపించకపోయినా, అతడు ఆజానుబాహువని తెలుస్తూనే వున్నది.

"అనుమానం రూఢి అయింది. వాళ్లు విల్లంబులతో సర్వసన్నద్ధంగా వచ్చారు. మనం మాత్రం వాళ్ల పడవలు అందు బాటులోకి వచ్చేవరకు, వాళ్ళ బాణాల బారి పడకుండా, లోపలకు దిగి కూర్చో వటం మంచిది," మందరదేవుడు యిలా హెచ్చరించే లోపల రివ్వుమంటూ ఒక బాణం వచ్చి, అతడు నుంచున్న పడ వకు తగిలింది.

వెంటనే మందరదేవుడూ, సైనికులూ పడవ లోపలి భాగంలోకి దూకి, తలలు వంచుకుని కూర్చున్నారు.



మనుషులు ఒకరినొకరు హెచ్చరించు కోవటమూ, బలంగా తెడ్లు వేయటమూ, దాక్కున్న మందరదేవుడికీ, సైనికులకూ వినబడుతూనే వుంది. శత్రువులు అతి వేగంగా తమను సమీపిస్తున్నారని వారు గ్రహించారు. శత్రువులు కత్తివేటుకు అందేంత దగ్గరకు వచ్చేవరకూ యిలా పడవలలో వంగి కూర్చోవలసిందే. తరవాత బాహాబాహి యుద్ధంలో – ఎవరు అదృష్టవంతులో, సాహసవంతులో వాళ్లు గెలుస్తారు!

ఇలాంటి ఆలోచనలతో ప్రాణాలు వుగ్గ పట్టుకు కూర్చున్న సైనికులకూ, మందర దేవుడికీ, 'జై, సమరసేన్!' అన్న భీకర నినాదాలు వినిపించినై. ఈ కొత్త జయ ధ్వానం ఏమిటా అన్న ఆశ్చర్యంలోంచి బయట పడకముందే మందరదేవుడు కూర్చున్న పడవను, మరో పడవ వేగంగా తాకి, తల్లకిందులు చేసేంత ప్రమాదం సంభవించింది. తృటిలో మందరదేవుడు కత్తి దూసి లేచి నిలబడ్డాడు. 'జై, మరాళీ!' అన్న అతడి సింహనాదం సముద్రం మీద మారు మోగింది. ఆ క్షణంలోనే అతడి చేతనున్న కత్తి మెరుపులా ఒక శత్రువును తాకింది. వాడు చావు కేక పెట్టి సముద్రంలో పడిపోయాడు. అంతలో మందర దేవుడి నలుగురు సైనికులూ భీకరంగా అరుస్తూ ఎదిరి పడవల మీదికి లంఘించారు. కాని అంతలోనే ''ఆగండి,





ఆగండి! మనం శత్రువులం కాదు!'' అన్న పెద్ద కేక అందరినీ నిర్విణ్ణులను చేసింది.

ఆసరికే మరో యిద్దరు మందరదేవుడి సైనికుల కత్తిపోట్లకు అరుస్తూ సముద్రం లోకి దొర్లిపోయారు.

మందరదేవుడు కత్తి పైకెత్తి, ''ఐతే, మిరెవరు? కుండలినీ నరవాహనమిత్రుడి సైనికులు కారా?'' అంటూ కఠినంగా ప్రశ్నించాడు.

''మేము కుండలినీ వాసులమే! కాని, నరవాహనమిత్రుడు మాకు ప్రబలశత్రువు. మీరు మరాళద్వీపవాసులైతే, మనమంతా స్నేహితులం, శత్రువులంకాదు. కత్తులు దించండి!'' అన్నాడు ఒక దీర్ఘ కాయుడు.

ఇందులో ఏమైనా మోసం వున్నదా అన్న సంశయం కలిగింది మందరదేవు డికి. కాని, అంతలోనే అతడు స్థిమిత పడి, ''మీరు కుండలినీరాజ్యం వాళ్ళా! ఐతే, మీ నాయకుడెవరు? అతడి పేరేమిటి?'' అని ప్రశ్నించాడు.

''నా పేరు శివదత్తుడు. ఈ పడవలలో వున్న వారందరూ నా అనుచరులు!'' అన్న జవాబు వచ్చింది.

''స్వాగతం, శివదత్తా! స్వాగతం,'' అన్నాడు మందరదేవుడు మహోత్సా హంతో. ''ఇప్పటికి ఇరవైఏళ్ళ క్రితం— అంటే నేను పది సంవత్సరాల ప్రాయపు వాడుగా వుండగా, మీ పేరూ, కుండలినీ మహాసేనాని అయిన సమరసేనుడి పేరూ విన్నాను. మీరూ, సమరసేనుడూ ఎక్కడో భయంకర ద్వీపాల్లో చేసిన సాహసోపేత కార్యాలు, కథలలా వినే వాడిని. ఇప్పుడు స్వయంగా ఆ మహాసేనాని ముఖ్యాను చరులైన మిమ్మల్ని చూసే భాగ్యం కలి గింది. మీకు నా హృదయపూర్వక స్వాగతం!''

''మీరెవరు? మరాళద్వీప రాజైన మందరదేవులు కాదుగదా?'' అన్నాడు శివదత్తుడు.

''అవును. నేను రెండు గంటల కిందటి వరకూ మరాళద్వీప రాజైన మందర దేవుణ్ణే! కాని, యిప్పుడు కేవలం మందర దేవుణ్ణి! నా రాజ్యం, నా కిరీటం నర వాహనమిత్రుడి పాదాక్రాంతమై పోయి నవి!'' అన్నాడు మందరదేవుడు.

శివదత్తుడు జవాబేమీ యివ్వలేదు. అతడి అనుచరులతో వున్న రెండు పడవలూ, మందరదేవుడి పడవల పక్కగా వచ్చి ఆగినై. శివదత్తుడు, మందర దేవుడున్న పడవలోకి వచ్చాడు. అతడేదో చెప్పదలచి అలా వచ్చినట్టు గ్రహించిన మందరదేవుడు, తన పక్కగా అతడికి కూర్చునేందుకు చోటు చూపాడు.

శివదత్తుడు కూర్చుంటూనే, "రాజ్యంతో పాటు రాజబిరుదం కూడా పోతుందనటంలో సత్యం లేకపోలేదు. సరే, మిమ్మల్ని మందరదేవులనే పిలుస్తాను. ఇప్పుడు తమ ప్రయాణం ఎక్కడికి? గమ్యస్థానం ఏదో నాకు చెప్పవచ్చునా?'' అని అడిగాడు.

మందరదేవుడు నిట్టూర్చి, అంతలో చిరునవ్వు నవ్వాడు. ''నా గమ్యస్థానం ఏదో నాకే తెలియదు. నరవాహనమిత్రుడి చేతులలో పడకుండా తప్పించుకపోవటమే ప్రస్తుతానికి నేను చేస్తున్న పని. వీరు నలుగురూ నా సైనికులు,'' అన్నాడు.



''చాలా బావుంది. అంటే యిద్దరం ఒకే రకమైన పరిస్థితులలో వున్నామన్న మాట! నేనూ ఆ క్రూరుడి బారి నుంచి తప్పించుకుపోవటమే ఆశయంగా బయలు దేరాను,'' అన్నాడు శివదత్తుడు.

అంతలో మందరదేవుడి సైనికులలో ఒకడు లేచి, ''మహారాజా! తీరం కేసి చూడండి! ఒకేసారి అన్ని దీపాలు కదలటం ఆశ్చర్యంగా లేదా? అవన్నీ సముద్రం మీదికి బయలుదేరిన పడవలని నా వుద్దేశం. శత్రువులు మనకోసమై బయలుదేరటం లేదుగదా?'' అన్నాడు.

శివదత్తుడూ, మందరదేవుడూ తీరం కేసి చూశారు. సైనికుడు చెప్పినదానిలో

అతిశయోక్తి ఏమీ లేదు. తీర ప్రాంత మంతా దీపాల కాంతితో ప్రకాశిస్తున్నది. గాలిలో ఎగిరే పెద్ద పెద్ద మిణుగురు పురుగులా అన్నట్టు అలల తాకిడికి, దీపాలతో వున్న పడవలు పైకీ కిందికీ కదులుతున్నవి.

"మనం సూటిగా సముద్రంలోకి పోగలినంత దూరం పోవటం, అన్ని విధాలా శ్రేయస్కరం. అదృష్టవంతుల మైతే ఏదైనా ద్వీపాన్ని చేరగలం, లేకపోతే విధివ్రాత........అంతకన్న మరేం లేదు. ఏ పరిస్థితులలోనూ నరవాహనమిత్రుడి చేతబడటం సహించరానిది," అన్నాడు శివదత్తుడు.

మందరదేవుడు అంగీకార సూచకంగా తల వూపాడు. నాలుగు పడవలూ తెడ్ల సహాయంతో మహాసముద్రం మీదికి బయలుదేరాయి. వాళ్ళు అనుమానించి నట్లు తీరాన కనబడిన దీపపు కాంతులు, నరవాహనమిత్రుడి నావికాదళానివే! వాళ్ళూ సముద్రం మీదికి బయలుదేరారు. తమను ఆ పడవలు వెంబడిస్తున్నవని గ్రహించిన శివదత్తుడు తమ పడవల్లో వున్న దీపాలను ఆర్పి వేయించాడు.

ఇప్పుడు పడవలు నాలుగూ, చీకట్లో నడుస్తున్నవి. ఒకదాని నొకటి తాకి ప్రమాదం కలగకుండా వుండేందుకు, వాటిని నడిపేవారు తగు జాగ్రత్త తీసుకున్నారు. మందరదేవుడు, నక్షత్రాలతో మిలమిల లాడుతున్న ఆకాశాని కేసి ఓ మారు చూచి, "శివదత్తా! కుండలినీ ద్వీపవాసులూ, మహాసేనాని సమరసేనుని అనుచరులైన మీరు కూడా, యీ విధంగా ఆ ద్వీపాన్ని వదిలి ఎందుకు పారిపోవలసి వచ్చింది? ఈ విషయం నాకు ఆశ్చర్యం కలిగిస్తున్నది!" అన్నాడు.

శివదత్తుడు ఒక్క క్షణం ఆలోచించి, "అంతా ఆ నరవాహనమిత్రుడి కుటిల రాజనీతి ప్రభావం. పోతే, యిందులో సమరసేనుడి తప్పు కొంత లేకపోలేదు. ఆ సంగతంతా చెపుతా వినండి!" అంటూ ప్రారంభించాడు. —(ఇంకా వుంది)





# సేనాని ఎన్నిక

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, శ్రమతో కూడిన యింత కఠినకార్యానికి, నిన్నెవరు ప్రోత్సహించారో నాకు తెలియదు. కాని ఒక్కొక్కసారి మనుషుల ఆలోచనా ధోరణులలో వున్న వైరుధ్యాల కారణంగా, ఏది మెచ్చదగిందో, ఏది కాదో కూడా తెలియకుండా పోతుంది. ఇందుకు ఉదాహరణగా నీకు చిత్రపుర రాజు కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను,'' అంటూ యిలా చెప్పసాగాడు:

చిత్రపుర రాజ్యంలో సైన్యాధ్యక్షుడి పదవికి ఖాళీ ఏర్పడింది. సాధారణంగా ఉపసేనాధిపతిగా పనిచేస్తున్న వ్యక్తిని,

బేతాళ కథలు



సేనాపతులుగా చేతనవర్మ, చందనవర్మల మనస్తత్వం తెలుసుకునేందుకు రాజు ఒక పథకం ఆలోచించాడు. చిత్రపుర రాజ్యం మీద ఎంతోకాలంగా శత్రుత్వ భావంతో వున్న రెండు పొరుగు రాజ్యాలున్నవి. ఆ రాజ్యాలను ఆక్రమించడంలో, తాము చూపే ప్రతిభనుబట్టి, చేతన, చందనవర్మల్లో ఒకరిని సైన్యాధ్యక్షుడుగా నియమించదలిచాడు.

రాజు యీ సంగతి ఉపసేనాధిపతులిద్దరికీ చెప్పాడు. ఇందుకు యిద్దరూ తమ ఆమోదం తెలిపారు. ముందుగా చేతనవర్మకు కొంత సైన్యం యివ్వబడింది. ఆ సైన్యంతో అతడు శత్రురాజును జయించాలి.

చేతనవర్మ మహోత్సాహంతో శత్రురాజు మీదికి దండెత్తి వెళ్ళాడు. నిజానికి శత్రుసైన్యం కన్న, చేతనవర్మ సైనిక బలం చాలా తక్కువ. చేతనవర్మ యీ సంగతే గుర్తించలేదు. అతడి దృష్టి సైన్యాధ్యక్ష పదవి మీదే వున్నది.

తన వెంట వున్న స్వల్ప సైన్యంతో చేతనవర్మ శత్రుసైన్యం మీద దాడిచేసి, బాగా సైనికనష్టం పొందాడు. అతడు మిగిలిన సైన్యంతో వెనుదిరిగి పోవాలనుకుంటున్న సమయంలో, విజయం తనదే అన్న ధీమాతో శత్రురాజు, కొద్ది మంది

ఆ స్థానంలో నియమించడం అనాదిగా చిత్రపుర రాజ్యంలో వస్తున్న ఆచారం. కాని, యిప్పుడు అలా చేసేందుకు ఒక గట్టి చిక్కు అడ్డు తగిలింది. సైన్యాధిపతి పదవికి అర్హులైన ఉపసేనాధిపతులు యిద్దరున్నారు. ఒకడు చేతనవర్మ, మరొకడు చందనవర్మ. ఇద్దరూ సేనానులుగా శౌర్య, పరాక్రమాల్లో పేరెన్నికగన్నవాళ్ళే!

రాజు చిత్రగ్రీవుడికి ఆ ఇద్దరిలో ఎవరికి సైన్యాధ్యక్ష పదవి యివ్వాలో అంతుబట్టలేదు. మంత్రులు కూడా ఒక నిర్ణయానికి వచ్చి, రాజుకు సలహా యివ్వలేక పోయారు.

అంగరక్షకులతో వచ్చి, అతడి దారిని అడ్డగించాడు. చేతనవర్మ తన సైనికులతో చప్పున శత్రురాజును చుట్టు ముట్టి బంధించి, శిరశ్ఛేదం చేస్తానని భయపెట్టి, అతడి నుంచి చిత్రపుర రాజుకు సామంతుణ్ణి అన్న సంధిపత్రం తీసుకున్నాడు.

ఈ విధంగా చేతనవర్మ విజయగర్వంతో చిత్రపురికి తిరిగి వచ్చాడు.

తరవాత చందనవర్మకు కూడా, చేతనవర్మకు యివ్వబడినంత సైనిక బలమే యివ్వబడింది. చందనవర్మ సరాసరి సరిహద్దు దాటి శత్రురాజు పైకి యుద్ధానికి పోలేదు. అతడు సరిహద్దు ప్రాంతాల శిబిరం ఏర్పాటు చేసుకుని, శత్రురాజు సైనిక బలాన్ని గురించీ, కోట రక్షణలను గురించీ వేగుల ద్వారా రహస్య సమాచారం సేకరించాడు.

ఈ సమాచారం ద్వారా చందనవర్మ, తాను సరిహద్దు దాటి శత్రురాజు కోటను ముట్టడించి జయించడం సాధ్యం కాదని గ్రహించాడు. ఒకవేళ శత్రురాజు తానున్న స్థావరం తెలుసుకుని, కోట వదిలి సైన్యంతో దండెత్తి వస్తే, అతణ్ణి సరిహద్దు దాటకుండా ఆపగల సైనికబలం మాత్రం తనకున్నది.

చందనవర్మ, రాజుగారి దర్శనం చేసుకుని, "మహారాజా, వేగుల ద్వారా శత్రురాజు సైనిక బలాన్ని గురించీ, కోట రక్షణలను గురించీ తెలుసుకున్నాను. నేను సరిహద్దు దాటి అతడి కోటను ముట్ట



డించడం అంటే, అనవసర సైనిక నష్టమూ, బహుశా పూర్తి ఓటమీ తప్ప మరేం వుండదు. అందువల్ల; నేను శత్రు రాజు మీద దాడి ప్రయత్నం మానుకుంటున్నాను,'' అని చెప్పాడు.

రాజు చందనవర్మను వెంటనే సైన్యాధ్యక్షుడుగా ప్రకటించాడు.

బేతాళుడు యీ కథ చెప్పి, ''రాజా, చిత్రపుర రాజు చేసినపని అనాలోచితమైనదిగా కనిపించడం లేదా? యుద్ధంలో శత్రురాజును జయించి వచ్చిన చేతనవర్మకు కాక, అసలు శత్రురాజు పైకి యుద్ధానికి వెళ్ళేందుకే జంకిన చందనవర్మను సేనానిని చేయడం ఏమిటి? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''రాజు నిర్ణయం అనాలోచితం కాదు; సరైనదే! సేనానాయకుడైన వాడికి వుండవలసిన ప్రధానలక్షణం తన బలం, శత్రుబలాన్ని గురించిన వాస్తవమైన అంచనా. అది చేతకానివాడు కేవలం విజయకాంక్షతో చేతనవర్మలా బలమైన శత్రువును ఎదిరించి, అనవసర సైనికనష్టానికి కారణమై, తను సేవించే రాజుకే అపాయం తెచ్చి పెడతాడు. చేతనవర్మ విజయానికి కారణం, శత్రురాజు అవివేకం తప్ప మరేం కాదు. అలాకాక చందనవర్మ తన సైనిక బలం ఏపాటిదో బాగా ఎరిగినవాడు. శత్రురాజ్యం పైకి దాడి వెళ్ళే ముందు వేగుల ద్వారా శత్రు సైనికబలం గురించి క్షుణ్ణంగా తెలుసుకున్నాడు. అలాంటి సైన్యాధ్యక్షుడి వల్ల రాజుకు గొప్ప విజయాల మాట ఏమోగాని, అనవసరమైన ఓటములు మాత్రం కలగవు. ఈ సంగతి ఎరిగినవాడు కావడం వల్లనే, చిత్రపుర రాజు చందనవర్మను సైన్యాధ్యక్షుడుగా ఎన్నిక చేశాడు,'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# చెట్టుమీద బ్రహ్మరాక్షసుడు

నాగభూషణానికి అనుకోని విధంగా కష్టాలు ముంచుకు వచ్చాయి. అతడు ఆ ఏడాదే అప్పు చేసి కూతురి పెళ్ళి చేశాడు. భార్య జబ్బుపడితే, బోలెడు డబ్బు ఖర్చు పెట్టి వైద్యం చేయించాడు. పొలం మీద ఎన్నో ఆశలు పెట్టుకుంటే, ఆ ఏడాది వానలు సరిగ్గా లేక, పంటలు పండలేదు. అప్పు యిచ్చిన వడ్డీ వ్యాపారి ఉన్న యిల్లూ, పొలం అమ్మేసి తన బాకీ తీర్చమని వత్తిడిచేస్తున్నాడు.

ఇక తన కష్టాలు తీరే మార్గం లేదనిపించి, నాగభూషణం ఆత్మహత్య చేసుకుందామనుకుని, ఒక అర్ధరాత్రి సమయాన దొడ్లో వున్న కుంకుడుచెట్టు దగ్గిరకు వెళ్ళాడు. ఆ సమయంలో అతడికి దేవుణ్ణొకసారి ప్రార్థించాలనిపించింది.

"భగవంతుడా, వచ్చే జన్మలోనైనా నన్ను భాగ్యవంతుడుగా పుట్టించు," అంటూ నాగభూషణం రెండు చేతులూ జోడించాడు. ఆ మరుక్షణం అతడి కాళ్ళ దగ్గిర ఒక మూట పడింది. నాగభూషణం ఉలిక్కిపడి, దాన్ని తీసుకుని, లోపల ఏమున్నదో చూశాడు. అతడి కళ్ళు చెదిరిపోయాయి. మూటనిండా బంగారు కాసులు!

"ఆఖరుకు భగవంతుడు, నా మొరాలకించాడు," అనుకుంటూ నాగభూషణం మూట తీసుకుని ఇంట్లోకి వెళ్ళి, భార్యను నిద్రలేపి, జరిగింది చెప్పాడు.

"మంచి వాళ్ళకు భగవంతుడు ఎప్పుడూ మేలు చేస్తాడు," అనుకుంటూ అతడి భార్య కాసుల్ని కళ్ళకద్దుకుని, పెట్టెలో దాచింది.

ఆనాటితో నాగభూషణం దరిద్రం తీరిపోయింది. అప్పులన్నీ తీర్చేసి, మరి కాస్త పొలం కూడా కొనుక్కుని సుఖంగా బతకసాగాడు.

"వసుంధర"



అయితే, యిప్పుడు నాగభూషణానికి మరొక యిబ్బంది ఎదురైంది. తండ్రి దగ్గిర బాగా డబ్బు చేరడంతో, అతడి పెద్ద కొడుకు అల్లరిచిల్లరగా తయారై, జూదగృహాల వెంట తిరగసాగాడు.

ఒకరోజున జూదగృహంలో పెద్ద గొడవ జరిగింది. ఆ గొడవలో నాగభూషణం కొడుకు కొట్టిన దెబ్బలకు, ఆ ఊళ్ళోని ఒక రత్నాల వ్యాపారి కొడుకు స్పృహ తప్పి పడిపోయాడు. అతడు బతకడని అంతా అనుకున్నారు.

నాగభూషణానికి ఏం చేసేందుకూ పాలుపోలేదు. కొడుక్కు మరణశిక్ష పడితే, వాడు దక్కకుండా పోవడం అట్లా వుంచి, తనను అందరూ హంతకుడి తండ్రి అంటూ అవమానిస్తారు.

ఇంతకన్న చావు మేలనుకుంటూ, నాగభూషణం లోగడ లాగానే అర్ధరాత్రి వేళ కుంకుడు చెట్టు దగ్గిరకుపోయి, "భగవంతుడా, నా కొడుక్కు హంతకుడన్న అపఖ్యాతి రాబోతున్నది. వచ్చే జన్మలోనైనా, బుద్ధిమంతుడైన కొడుకును ప్రసాదించు!" అన్నాడు.

ఆ సమయంలో చెట్టు కొమ్మల్లోంచి, "ఆ రత్నాల వ్యాపారి కొడుకు నిక్షేపంలా వుంటే,, నీ కొడుకు హంతకుడెలా అవుతాడు?" అన్న మాటలు వినిపించినై.

నాగభూషణం ఆశ్చర్యపోతూ చెట్టు కొమ్మల్లోకి చూశాడు; ఏమీ కనిపించలేదు. భగవంతుడే తనకు అలా చెప్పి వుంటాడని అతడికి తోచింది. వెంటనే అతడు బయలుదేరి రత్నాల వ్యాపారి ఇంటికి వెళ్ళాడు. వ్యాపారి కొడుకు ఒంటి నిండా కట్లతో మంచంలో పడుకుని వున్నాడు. అతని తలిదండ్రులూ, బంధువులూ దిగులుగా కూర్చుని వున్నారు.

రత్నాల వ్యాపారిని సమీపిస్తూనే నాగభూషణం కోపంగా, "ఏమయ్యా, నీ కిదేమైనా న్యాయంగా తోస్తున్నదా? నా మీద నీకు పగ వుంటే, మరో విధంగా తీర్చుకోవచ్చు. కాని, నా కొడుకు మీద యిలాంటి

అన్యాయపు ఆరోపణ చేస్తావా? నిక్షేపంలా వున్న నీ కొడుక్కు దొంగ కట్లు కట్టి, నా కొడుకు కొట్టాడని అందరికీ చెపుతావా ?'' అన్నాడు.

రత్నాల వ్యాపారి ఏదో జవాబివ్వబోతూండగా, అతడి కొడుకు చప్పున మంచంలో లేచి కూర్చుని, ''ఈ కట్లేమిటి? ఈ గొడవేమిటి ? ఛీ, ఛీ, ఇదంతా చెడ్డ చిరాగ్గా వున్నది,'' అంటూ కట్లు విప్పేసుకున్నాడు.

అతడి ఒంటి మీద చిన్న గాయపు గుర్తయినా లేదు. అందరూ ఆశ్చర్యపోయారు. ''అంతా ఏదో మాయలా వున్నది!'' అంటూ రత్నాల వర్తకుడి భార్య కొడుకును కావిలించుకున్నది.

''మాయో, మంత్రమో మనవాడు మనకు దక్కాడు. నేను, నాగభూషణానికి రుణపడి వున్నాను,'' అంటూ రత్నాల వర్తకుడు, నాగభూషణాన్ని క్షమాపణ కోరాడు.

నాగభూషణం తృప్తిగా ఇంటికి వెళ్ళిపోయాడు. ఇది జరిగాక అతడి కొడుకు ఎంతో బుద్ధిమంతుడిలా ప్రవర్తించసాగాడు. కొంతకాలం గడిచేసరికి, నాగభూషణానికి ఒక కొత్త ఆలోచన వచ్చింది. తను ధనవంతుడన్న మాట నిజం; కాని కోటీశ్వరుడేం కాదు. తర



తరాలపాటు తన వంశం సుఖపడేటంత సంపద సంపాయించాలంటే, ఒకే ఒక మార్గం వున్నది. దొడ్లో వున్న కుంకుడు చెట్టు దగ్గిర మరొకసారి ఆత్మహత్యా ప్రయత్నం చెయ్యడం! అందువల్ల తనకు రెండుసార్లు మేలు జరిగింది.

ఇలా ఆలోచించి నాగభూషణం ఒక అర్ధరాత్రి వేళ చెట్టు దగ్గిరకు వెళ్ళాడు. హఠాత్తుగా పైనుంచి దభీమంటూ ఒక బ్రహ్మరాక్షసుడు అతడి ముందు దూకి, ''మళ్ళీ ఎందుకొచ్చావు?'' అంటూ హుంకరించాడు.

బ్రహ్మరాక్షసుణ్ణి చూస్తూనే నాగభూషణానికి నోటమాట రాలేదు. అతడు అతి

కష్టం మీద గొంతు పెగుల్చుకుని, "ఎవరు నువ్వు ?" అని అడిగాడు.

"చావాలని వచ్చిన వాడివి నన్ను చూసి భయపడతావెందుకు? తెలియడం లేదా, నేను బ్రహ్మరాక్షసుణ్ణి. చాలా ఏళ్ళుగా, యీ చెట్టు మీద వుంటున్నాను. నువ్వు ఆత్మహత్య చేసుకోకుండా వుంటే, నాకీ భయంకర రూపం నుంచి విముక్తి కలిగి, స్వర్గం చేరుకుంటాను. అందుకే లోగడ రెండుసార్లు చావకుండా నిన్ను కాపాడాను," అన్నాడు బ్రహ్మరాక్షసుడు.

ఆ జవాబుతో నాగభూషణానికి భయం పోవడమే గాక, బ్రహ్మ రాక్షసుడి నుంచి మరికొంత సహాయం పొందవచ్చునన్న ఆశ కలిగింది.

"నా ఆత్మహత్యకూ, నీ స్వర్గప్రాప్తికీ యీ లంకె ఏమిటి ?" అన్నాడు నాగభూషణం.

ఆ ప్రశ్నకు బ్రహ్మరాక్షసుడు పెద్దగా నిట్టూర్చి, "భగవంతుడు మనిషికి కొంత ఆయువు యిచ్చి, ధైర్యంగా బతకమంటాడు. మనిషికి కష్టాలు వస్తే, ధైర్యంగా ఎదుర్కోవాలి తప్ప, ఆత్మహత్యల్లాంటి వాటికి పాల్పడరాదు. నేను, నీ పూర్వీకుణ్ణి. కష్టాలు భరించలేక ఆత్మహత్య చేసుకుని, ఆ పాపఫలితంగా బ్రహ్మరాక్షసుణ్ణయాను. నా వంశంలో, నా తర్వాత అయిదు తరాల వరకూ, ఎవరూ ఆత్మహత్య చేసుకోకుండా వుంటే, నా పాపం నశించి, స్వర్గప్రాప్తి కలుగుతుంది. నా వంశంలో వాడికెవడికైనా రెండుసార్లు మాత్రమే, నేను సాయపడగలను. ఇప్పుడు నువ్వు నా వంశంలో అయిదోతరం వాడివి. రెండుసార్లు నీకు సాయపడ్డాను. ఇప్పుడు నువ్వు ఆత్మహత్య చేసుకుని, నాతోపాటు యీ చెట్టు మీద తోడుగా వచ్చినా సరే, లేదా బతికినంతకాలం ధైర్యంగా బతికి, నన్ను స్వర్గంలో కలుసుకున్నా సరే!" అని చెట్టు మీదికి ఎగిరిపోయాడు.

నాగభూషణం ఆ తర్వాత మళ్ళీ ఎన్నడూ, ఆత్మహత్యా ప్రయత్నం తల పెట్టలేదు.





# శాంతిదేవత

పూర్వ కాలంలో కొంతమంది కత్తిని ఆశ్రయించి బతికేవాళ్ళు. అనగా, కత్తిని చేతపట్టి యుద్ధాలలో పాల్గొని జీవనం సాగించేవారు.

అలా అనేక యుద్ధాలలో మహా యోధుడు శూరసింహుడు పనిచేశాడు. అతనికి ఒకానొకప్పుడు ఉద్యోగం లేకుండా పోయింది. అందుకు కారణం రాజులకు యుద్ధాలంటే విసుగుపుట్టడం. వాళ్ళు సంప్రతింపులు జరిపి, సంధులు చేసుకున్నారు, అస్త్రశస్త్రాలన్నీ మూల పారవేశారు. రాజ్యం ప్రశాంతంగా వుంటే యుద్ధం అవసరం లేదుకదా. సైనికులూ అంతే!

ఇప్పుడు శూరసింహుడికి గట్టి చిక్కే వచ్చింది. అతనికి చేతనైన పని ఒక్కటే, కత్తి చేత పట్టటం, ఎన్ని తలలనైనా అవలీలగా నరికివేయటం. మరిప్పుడు యుద్ధం చేసే అవకాశమే లేదు. అతడికి మరేపనీ చేతకాదు.

"రాజులంతా పిరికిపందలై పోయారు! ప్రజలంతా పౌరుషహీనులయారు! నా కత్తి మూల పడవలసిందేనా? తుప్పు పట్టవలసిందేనా?" అని అతనికి తీరని విచారం కలిగింది.

ఏమైతేనేం, తిండికీ, గుడ్డకూ మొహం వాచి, శూరసింహుడు కృశింపసాగాడు. గడ్డి గాదం లేక అతని గుర్రం బక్క చిక్క పోయింది. చివరకు విధిలేక ఉద్యోగం కోసం బయల్దేరాడు శూరసింహుడు.

వెళ్ళగా వెళ్ళగా, ఒకనాటి సూర్యోదయం వేళ ఒక పొలం చేరుకొన్నాడు. ఆ పొలం దున్నుకొంటున్న రైతును శూరసింహుడు తన గుర్రం మీది నుంచే కేకవేసి, "నా పేరు శూరసింహుడు,



వినలేదా? నేను మహాయోధుణ్ణి. నేనిప్పుడు పని లేకుండా వున్నాను. నాకేమైనా పని చూపించగలవా?'' అన్నాడు.

ఈ ప్రశ్న వినగానే రైతు, దున్నటం మాని, శూరసింహుడి కేసి చప్పున తిరిగి చూశాడు. ఒరలో కత్తి, వాలకం చూడగా రైతుకు భయమూ వేసింది, జాలీ కలిగింది.

''నాగలి దున్నటం చేతనైతే నాదగ్గిర పని వుంది. ముందు ఆ కత్తీ కఠారులూ అవతల పారవేసి రావయ్యా,'' అన్నాడు రైతు.

అందుకు శూరసింహుడు, ''నాగలి దున్నటం నా చేతకాదు. నీకు శత్రువులెవరైనా వుంటే చెప్పు, నిమిషంలో వాళ్ళ తలలు నరికి నీ ఎదట పెడతాను. నాకు భోజనం, నా గుర్రానికి ఇంత దాణా ఏర్పాటు చేస్తే చాలు. మరేమీ వద్దు'' అన్నాడు.

రైతు మాట్లాడలేదు. క్షణకాలం శూరసింహుని కేసి చూసి, మళ్ళీ ఎప్పటిలాగా పొలం దున్నుకోసాగాడు.

''ఛీ, పౌరుష హీనులు! మనిషన్న తరవాత శత్రువే ఉండడా? చేతకాకపోతే సరి, శత్రువును సంహరించటం. పైగా నన్ను నాగలి దున్నుకు బతకమంటున్నాడు, ఈ పిరికిపంద. నా వంటి యోధుడు చేయవలసిన పనేనా ఇది?'' అనుకొన్నాడు తనలో శూరసింహుడు.

ఇలా అనుకొని ఒక అరణ్యమార్గం పట్టి పోగా పచ్చటి మైదానం కంటబడింది. ఆ మైదానంలో మంచి ఎత్తున ఒక దేవతావిగ్రహం వున్నది. అదే యుద్ధ దేవత!

ఉత్సాహంతో గుర్రాన్ని దౌడు తీయిస్తూ పోయి, శూరసింహుడు ఆ విగ్రహం ముందు నిలబడ్డాడు.

ఆ దేవి విగ్రహం ఇరవై అడుగుల ఎత్తున వుంది. నిప్పులు చెరిగే కన్నులు, చేతులలో విచ్చు కత్తులు — భయం కొల్పుతూ వున్నాయి. కాని, దేవి చేతిలో



కత్తి చూడగానే శూరసింహుడు సంతో షంతో ఉప్పొంగి పోయాడు.

"ఆహాఁ, ఏమి విగ్రహం! అంతా అచ్చు బంగారం!!" అని ఒక్క కేక వేశాడు, ఉత్సాహం పట్టలేక.

"కాదోయ్, విగ్రహమంతా వెండి! ఇది రజత విగ్రహమే కాని స్వర్ణ విగ్రహం ఎంతమాత్రం కాదు," అంటూ బదులుగా అతనికి ఒక కేక వినిపించింది.

కేక వినిపించేటంతలోనే ఆ విగ్రహానికి వెనుకనుంచి డాలూ, కత్తీ ధరించిన ఒక గుర్రపురౌతు ముందుకు వచ్చాడు.

పౌరుషంతో శూరసింహుడు పళ్ళు పట పట కొరికాడు. ఒరలోనుంచి కత్తి దూశాడు.

"ఏమోయ్! నా మాటనే ధిక్కరిస్తున్నావా? నా పేరు తెలుసా? శూ-ర-సింహుడు...." అని గర్జించాడు శూరసింహుడు.

రెండవ యోధుడు వెటకారంగా నవ్వి, కత్తి ఒరలోనుండి బయటకు లాగుతూ, "ఏయ్! నువు కళ్ళులేని కబోదిలాగా ఉన్నావే! వెండికీ, బంగారానికీ తేడా తెలియని నీతో యుద్ధానికి తల పడటమంటే నిజంగా నాకు అవమానకరంగా తోస్తున్నది. నా పేరేమిటో తెలిసే మసులుకొంటున్నావా? నేను ధీరసింహుణ్ణి. రా, నా కత్తిబలం చవి చూపిస్తా," అన్నాడు, గుర్రాన్ని ముందుకు ఉరకలు ˜యిస్తూ.

మరుక్ష ాలోనే యోధులిద్దరూ తలపడ్డారు. కత్తుల వొరిపిడితో, గుర్రాల సకిలింపులతో, వారి పౌరుషవాక్కులతో ఆ ప్రదేశం తెరిపి లేకుండా మారుమోగిపోతున్నది. అంతలో హఠాత్తుగా, "ఆగండి! కత్తులు ఒరలో పెట్టండి!!" అంటూ ఒక కేక వినిపించింది, యోధులిద్దరూ ఆ కేక వచ్చిన దిక్కుకి ఆశ్చర్యంగా చూచారు.

మల్లెపువ్వుల వంటి తెల్లటి దుస్తులు ధరించి, శాంతం ఉట్టిపడుతున్న మోము కల, ఒక అందమైన యువతి నవ్వుతూ

వారి వద్దకు వచ్చి, "మీ యిద్దరూ మహా యోధులే! అసహాయ శూరులే!!" అన్నది.

"వాని సంగతి ఏమోకాని, నా పేరు శూరసింహుడు," అన్నాడు. శూర సింహుడు.

"వాని సంగతి తెలియదు కాని, నా పేరు ధీరసింహుడు," అన్నాడు, ధీర సింహుడు.

ఇద్దరికేసీ చూచి ఆ యువతి, "మీ కత్తుల పదునులో కాస్తంతయినా మీ బుద్ధులకు ఉంటే ఈ కొట్లాట జరిగేది కాదు," అన్నది.

"మూర్ఖుడికి దూరదృష్టి లేదు. ఈ యుద్ధదేవత విగ్రహం వెండిదట!" అని పరిహసించాడు శూరసింహుడు.

"అతనికి దృష్టి వక్రించింది. వెండి విగ్రహాన్ని బంగారు విగ్రహమని వాదించడమేమిటి, అవివేకం కాకపోతే!" అని గేలిచేశాడు ధీరసింహుడు.

అప్పుడా యువతి పకపక నవ్వి, యోధులిద్దర్నీ వెంటబెట్టుకొని విగ్రహం చుట్టూ తిప్పింది. వెండిదని మొండిగా వాదించిన ధీరసింహుడికి, విగ్రహానికి ఒక వైపు బంగారపు పూత కన్పించింది. విగ్రహం బంగారపుది అని వాదించిన శూరసింహుడికి వెండిపూత కన్పించింది.

ఇద్దరూ తెల్లబోయి, ఒకరివంక ఒకరు చూచుకోసాగారు. అంతలోనే ఆ యువతి అంతర్ధానమయింది. ఆమెకోసం వారిద్దరూ ఆత్రంతో అటూ ఇటూ చూసేసరికి ఒక దిక్కు నుంచి ఇలా వినబడింది:

"యోధుల్లారా! నేనే శాంతిదేవతను. మీ ఇద్దరూ మహా యోధులే. మీ యిద్దరి ఉద్దేశాలూ సరిఐనవే. కయ్యాలు మానండి. పౌరుషపడకండి. శాంతంగా జీవించండి!"

శూరసింహుడూ ధీరసింహుడూ గుర్రాల మీది నుంచి దిగారు. ఒకరినొకరు కౌగలించుకున్నారు. డాలూ, కత్తులూ విగ్రహం ముందు పారవేశారు. నాటి నుండీ వారిద్దరూ వ్యవసాయ వృత్తి అవలంబించి, ప్రశాంతంగా జీవనం గడిపారు.





# నీతివర్తనుడు

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పాలించే కాలంలో, బోధిసత్వుడు ఆయన కుమారుడుగా జన్మించాడు. బ్రహ్మదత్తుడు అతడికి శీలవుడు అని పేరు పెట్టుకున్నాడు.

కాలక్రమాన శీలవుడు కాశీరాజ్యానికి రాజయాడు. ఆయన ప్రజలను ఎంతో ప్రేమాదరాలతో పరిపాలించసాగాడు. దారిద్ర్యం వల్లా, అజ్ఞానం చేతా దొంగతనం మొదలైన నేరాలను చేసేవారిని ఆయన దండించడానికి బదులు, తన సమక్షానికి రప్పించుకుని, అవసరమైతే వాళ్ళకు డబ్బు యిచ్చి, హితబోధలు చేసి పంపేవాడు. ఇందువల్ల రాజ్యంలో నేరాలు తగ్గడమే కాక, ప్రజలకు తమ రాజుపై అంతులేని భక్తి గౌరవాలుండేవి.

కాశీరాజ్యానికి సమీపంలో వున్న కోసలదేశపు మంత్రికి, కాశీరాజ్యాన్ని సులువుగా గెలవవచ్చునని దుర్బుద్ధి పుట్టింది. ఆయన తన రాజుతో, "కాశీ రాజైన శీలవుడు అతి దుర్బలుడు. అతను బందిపోటు దొంగలనూ, హంతకులనూ సయితం దండించడానికి వెనకాడతాడు. అటువంటి పిరికివాణ్ణి, మనం సునాయాసంగా జయించవచ్చు," అని చెప్పాడు.

ఇది నిజమో కాదో తెలుసుకోడానికై, కోసలరాజు తన సైనికులను కొందరిని పిలిచి, "మీరు సరిహద్దు దాటి కాశీ రాజ్యంలో ప్రవేశించి, గ్రామాలను కొల్లగొట్టి రండి," అని ఆజ్ఞాపించాడు.

కోసల సైనికులు, కాశీ రాజ్య గ్రామాల మీదికి వచ్చి పడగానే, అక్కడి ప్రజలు కలిసి కట్టుగా వాళ్ళను ఎదిరించి పట్టుకుని, తమ రాజైన శీలవుడి దగ్గరకు తీసుకుపోయారు.

"మీరు విదేశీయుల్లాగా వున్నారు. మా గ్రామాలు కొల్లగొట్ట రావడానికి



పంపాడు. వాళ్ళు సరిహద్దు గ్రామాలు దాటుతూండగా, కాశీ రాజ్య ప్రజలకు దొరికిపోయారు. ఈసారి కూడా శీలవుడు బంధితులైన సైనికులను శిక్షించకుండా, కొంత డబ్బు యిచ్చి పంపేశాడు.

దీనితో కోసల రాజుకు ఎక్కడలేని ధైర్యం కలిగింది. ఆయన తన సైన్యాలతో కాశీరాజ్యం పైన యుద్ధానికి బయలు దేరాడు. ఈ వార్త గూఢచారుల ద్వారా తెలియగానే మంత్రులూ, సేనాపతులూ శీలవుడి దగ్గిరకు వచ్చి, "మహారాజా, కోసల రాజుకు మన శక్తి తెలియదులా వుంది. మహాదర్పంగా మన పైకి యుద్ధానికి వస్తున్నాడు. అతణ్ణి ఎదుర్కొనేందుకు, సైనిక సమీకరణకు అనుజ్ఞ యివ్వండి," అని కోరారు.

శీలవుడు యుద్ధానికి సమ్మతించలేదు. "అనవసర రక్తపాతం వద్దు. వాళ్ళకు కాశీరాజ్యం కావాలని వుంటే, అలాగే తీసుకోనివ్వండి. వాళ్ల కోసం కోట తలుపులు తెరిచి వుంచండి," అన్నాడు.

ఆయన ఒక దూత ద్వారా కోసల రాజుకు, "మీరు శత్రువులుగా రానవసరం లేదు. మిత్రులుగానే రావచ్చు," అని వర్తమానం పంపాడు.

ఈ వర్తమానాన్ని కోసలరాజు, శీలవుడి దౌర్బల్యంగా భావించాడు.

కారణం ఏమిటి?" అని రాజు శీలవుడు వాళ్ళను ప్రశ్నించాడు.

"మహారాజా, మాకు తిండికి జరగక, యిలా చేయవలసి వచ్చింది!" అన్నారు కోసల సైనికులు.

"మీకు తిండికే అంత యిబ్బందిగా వుంటే, నన్నడగక పోయారా?" అని శీలవుడు తన ధనాగారం నుంచి డబ్బు తెప్పించి, వాళ్లకు యిచ్చి పంపివేశాడు.

శీలవుడి యీ ప్రవర్తన చూసి కాశీ రాజుకు కొంత ధైర్యం కలిగింది. అయినా, మరొకసారి పరీక్షించి చూద్దామని అతడు, యీసారి ఎక్కువ మంది సైనికులను, కాశీరాజ్యపు నగరాల మీదికి దోపిడీకి

సద్వర్తనా, రాచమర్యాదలూ ఎరగని కోసల రాజు తన బలగంతో, కాశీరాజు సభా మందిరంలో ప్రవేశిస్తూనే, శీలవుణ్ణీ, మంత్రులనూ పెడరెక్కలు విరిచి కట్ట మని సైనికులను ఆజ్ఞాపించాడు.

"అతిథులు యిలా ప్రవర్తించడం ధర్మం కాదు," అన్నాడు శీలవుడు.

ఆ మాటలకు కోసల రాజు వికటంగా నవ్వాడు. అతడు ఆజ్ఞాపించగానే సైని కులు శీలవుడూ, ఆయన మంత్రులూ ధరించే లాంఛనాలను తీసివేశారు.

శీలవుడూ, ఆయన మంత్రులూ సాయంకాలంలోగా కాశీనగరం విడిచి, అరణ్య మార్గం పట్టి పోసాగారు. కొంత సేపటికి చీకటి పడింది. అందరూ అరణ్యంలోనే చెట్ల కింద పడుకున్నారు. వారికా రాత్రి భోజనం కూడా లేదు.

అర్ధరాత్రివేళ వారికి నిద్రాభంగ మైంది. చాలామంది దొంగలు కాగడాలు పట్టుకుని అక్కడికి వచ్చారు. వాళ్ళు, రాజు శీలవుడితో, "మహారాజా, మేము దొంగలం. తమ దయవల్ల యింతకాలంగా మేము దొంగతనాలు చెయ్యకుండా జరిగి పోయింది. కాని, నేటినుంచి మా కష్టాలు ఆరంభమౌతున్నవి. అందుచేత మేం యీ రాత్రి రాజసౌధం ప్రవేశించి, యీ సొత్తంతా దొంగిలించి తెచ్చాం.



ఇదిగో, మీ దుస్తులూ, లాంఛనాలూ, ఖడ్గాలూ! ఇది మీ కోసం తెచ్చిన రాజ భోజనం. మీరు ముందుగా రాజోచితమైన దుస్తులు ధరించి, భోజనం చేసి, తరవాత మేం తెచ్చిన యీ ధనమంతా ఏం చేయ మంటారో సెలవియ్యండి," అన్నారు.

శీలవుడూ, ఆయన మంత్రులూ భోజ నాలు చేసి తమ, తమ దుస్తులు ధరిం చారు. తరవాత శీలవుడు దొంగలతో, "కొత్తరాజు, మీ సమస్యను ఎట్లా పరి ష్కరించేదీ తెలుసుకోవడం మంచిది. అది తెలుసుకోకుండా ముందుగానే మీరిలా దొంగతనాలకు పాల్పడడం మంచిది కాదు. ఈ ధనమంతా తీసుకు

పోయి రాజుకు యిచ్చి, ఆయన మీ బతుకుతెరువుకు ఏం చేయమంటాడో అడగండి,'' అన్నాడు.

''అతిథ్యం యిచ్చిన వారిని, పచ్చిదారి దొంగలా దోచిన వాడికి న్యాయబుద్ధి వుండదు, మహారాజా! మే మా నీచుడి దగ్గిరకు వెళ్లం. మీరే, మాకు ఎప్పటికీ మహారాజులు,'' అన్నారు దొంగలు.

''ఆ కొత్తరాజు దగ్గిరకు మీరు వెళ్లక పోతే, యీ ధనం తీసుకుని నేనే ఆయన దగ్గిరకు వెళతాను,'' అన్నాడు శీలవుడు.

ఆయన వెంటనే తన మంత్రులతో సహా బయలుదేరి, మర్నాడు ఉదయానికల్లా రాజసభ చేరుకున్నాడు. శీలవుణ్ణి చూడ గానే కోసలరాజు నిర్ఘాంతపోయాడు.

శీలవుడు జరిగినదంతా చెప్పి, ''మహా రాజా, నా కన్న ప్రజలను మరింత న్యాయంగా పరిపాలించాలనే కదా, మీరు నన్ను వెళ్లగొట్టి, నా సింహాసనం ఆక్ర మించుకున్నారు? ఆ మాయకులైన దొంగలు, యీ సంగతి గుర్తించక, తమ పరిపాలనలో జరుగుబాటుండదని భయ పడి, రాత్రి తమ ఖజానా దోచారు. వారి సమస్యలను, నా కన్న మీరు మరింత న్యాయసమ్మతంగా పరిష్కరిస్తారని అభయం యిచ్చి, మీ సొత్తు, మీకు ఒప్ప గించ వచ్చాను. ఇంతకన్న, ఈ రాజ్యంలో నాకు వేరే పనిలేదు,'' అన్నాడు.

ఈ మాటలతో కోసలరాజుకు హృదయ పరివర్తన కలిగింది. ఆయన సింహాసనం మీది నుంచి లేచి వచ్చి, శీలవుడి కాళ్లపై బడి, ''మహాత్మా, దొంగలు సయితం ప్రేమించే మీ మహిమా, సద్వర్తనా గ్రహించలేక, నీచుడైన నా మంత్రి సలహా విని, తమ పట్ల తీరని ద్రోహం చేశాను. నన్ననుగ్రహించి, మీ రాజ్యం మీరు ఏలు కోండి. మీ మైత్రి చాలు; మీ రాజ్యం నా కక్కరలేదు,'' అన్నాడు.

శీలవుడు తిరిగి కాశీ రాజ్యాధిపత్యాన్ని స్వీకరించాడు. ఆయన కోసలరాజుకు అన్ని మర్యాదలూ చేసి, అతణ్ణి, అతడి రాజ్యానికి పంపివేశాడు.





# గజనీ మహమ్మద్ దాడులు

సింధు ప్రాంతాన్ని బహు కొద్దికాలం పాటు పాలించినా, అరబ్బులకు అది మరొక విధంగా గొప్ప లాభకారణం అయింది. వాళ్ళు ధనంతోపాటు భారతీయ తత్వశాస్త్రాన్నీ, వైజ్ఞానిక, గణిత, సారస్వతాలను కూడా తమ వెంట తీసుకుపోయారు.

మహోన్నతమైన భారతదేశ వైభవం అరబ్బులను విభ్రాంతి పరిచింది. కల్పనా కథలూ, నీతి కథలూ, ఇతిహాసాలూ వాళ్ళకు చాలా ఆనందం కలిగించినై. వాళ్ల ద్వారా యీ కథా సాహిత్యం కొంత యూరపుదేశాలకు చేరింది.





ఖలీఫా హరూన్ అల్ రషీద్ దర్బారులో భారతదేశపు పండితులకూ, జ్యోతిశ్శాస్త్ర వేత్తలకూ, ఐంద్రజాలికులకూ గొప్ప ఆదరణ వుండేది. అరబ్ విద్వాంసులు భారతదేశపు గణితశాస్త్రాన్ని-ముఖ్యంగా ఖగోళశాస్త్రాన్ని చాలా కుతూహలంతో అధ్యయనం చేసేవారు.



క్రమంగా సింధు ప్రాంతాన అరబ్బుల అధికారం బలహీనమైంది. కాని, వాళ్లు భారతదేశపు ధనసంపత్తి సంగతి మరవలేదు. పదవ శతాబ్దంలో, ఖలీఫా ప్రతినిధిగా గజినీని పాలించే మహమ్మద్ తనను తాను సుల్తానుగా ప్రకటించుకుని, భారతదేశం పైకి దాడి వచ్చాడు.

ఆ కాలంలో పశ్చిమపంజాబు ప్రాంతాన్ని జయపాలుడు అనే రాజు పాలిస్తూండేవాడు. సుల్తాను మహమ్మద్ సైనికులతో, తాను ఇస్లాం మత వ్యాప్తి కోసం, యీ దండయాత్ర చేస్తున్నట్టు చెప్పి, వాళ్లను ఉత్సాహపరిచి జయపాలుడి రాజ్యం మీద దాడి చేశాడు.





జయపాలుడు తన సైన్యంతో, మహమ్మదును పెషావరు సమీపాన ఎదుర్కొని, ఓడిపోయాడు. ఈ అవమానం భరించలేక అతడు అగ్నిప్రవేశం చేసి, ఆత్మాహుతి చేసుకున్నాడు. అతడి కుమారుడైన అనందపాలుడు, ఉజ్జయిని, గ్వాలియర్, కలంజర్, కనోజ్ పాలకులను కూడగట్టి, శత్రువు తిరిగి దాడిచేస్తే, ఎదుర్కొనేందుకు సన్నద్ధుడయాడు.

మహమ్మద్ తిరిగి మరొకసారి దాడి చేశాడు. అనందపాలుడూ, అతడి మిత్రులైన రాజులూ మహమ్మద్‌ను నిలవరించి, అత్యంత సాహసంతో పోరాడసాగారు. ఆ సమయంలో ఆనంద పాలుడు ఎక్కి వున్న ఏనుగు గాయపడి, యుద్ధరంగం నుంచి పారిపోసాగింది. అది చూసిన అతడి మిత్రరాజులు, ఆనందపాలుడు అపజయం పాలయ్యా డనుకుని, యుద్ధరంగం నుంచి తిరోగ మించారు.





ఈ విధంగా విజయం సాధించిన మహమ్మదు అనేక రాజప్రాసాదాలనూ పట్టణాలనూ, దేవాలయాలనూ విధ్వంసం చేయడమే గాక, చాలామంది ప్రజలను కూడా బలిగొన్నాడు. కొద్ది పాటి వ్యవధిలోనే అతడు పదిహేను మార్లు దాడులుచేసి, ముల్తాన్, మధుర, కనోజ్ పట్టణాలను నాశనం చేయడమే గాక, అమూల్యమైన ఎంతో ధన, వస్తు సంపదను దోచుకుపోయాడు.

అతడి దురాశ, అతడిలో గల క్రౌర్యానికి, మత దురహంకారానికీ సరితూగగలది. ప్రభాస్ లోని సోమనాథ దేవాలయపు అపార ధనసంపదను గురించి విని, దానిని కొల్లగొట్టేందుకు దాడి ప్రారంభిం చాడు. అప్పుడు గుజరాత్‌ను పాలిస్తున్న చాళుక్య రాజులకు, అతి క్రూరమైన అతడి దండయాత్రను ఎదిరించగల శక్తి లేకపోయింది.





అర్చకులు, మహమ్మదును కనీసం గర్భగుడినైనా నాశపరచవద్దని అభ్యర్థించారు. కాని, అతడు వారిని చంపి గర్భగుడిని కూల్చి, దాచిన ధనం కోసం వెతికించాడు.

ఎన్నో ఏండ్లుగా భక్తులు ఆలయానికి సమర్పించిన విలువైన కానుకలు చాలా గదుల్లో భద్రపరచబడినవి. అవి ముఖ్యంగా రత్నాలూ, బంగారం. అంత ధనసంపత్తి కండ్లబడగానే మహమ్మద్ నివ్వెరపోయాడు. అతడు దానినంతా దోచుకున్న తరవాత, ఆలయాన్ని నేలమట్టం చేయవలసిందిగా సైనికులను ఆజ్ఞాపించాడు.





మహమ్మదు తిరుగుప్రయాణం ప్రశాంతంగా సాగలేదు. యుద్ధప్రియులైన జాట్‌లు అతణ్ణి దొమ్మియుద్ధాలతో నీరసపరిచారు. దోచిన భారతదేశపు ధనసంపత్తితో వైభవంగా జీవించే అవకాశం అతడికి లభ్యం కాలేదు. త్వరలోనే వ్యాధిగ్రస్తుడై, మహమ్మదు 1030 సంవత్సరంలో మరణించాడు. కాని, అతడి క్రౌర్యం భారతదేశానికి మానని గాయమైంది.

# మరవరాని సత్యం

కరూరు అనే గ్రామంలో కందస్వామి అనే ధనికుడుండేవాడు. ఆయనకు నలుగురు కొడుకులు. వాళ్ళు తండ్రిపట్ల భక్తి శ్రద్ధలు కనబరిచేవారు. కాని, అప్పుడప్పుడూ ఏ స్వల్ప విషయంలోనో వచ్చిన అభిప్రాయభేదాలతో కీచులాడుకునేవారు.

కందస్వామికి ఒకసారి బాగా జబ్బుచేసి, తిరిగి తాను ఆరోగ్యవంతుణ్ణి కాలేనేమో అన్న భయం పట్టుకున్నది. తన తదనంతరం కొడుకులు ఐకమత్యంగా వుండాలన్నది ఆయన కోరిక.

ఆయన యింటి ముందున్న ఖాళీజాగాలో, ఒక పొగరుబోతు గిత్త విచ్చలవిడిగా తిరుగుతూండేది. ఆయన తన పెద్ద కొడుకుకు ఒక తాడు యిచ్చి, గిత్తను యింటి గుమ్మం దగ్గిరకు తీసుకు రమ్మన్నాడు.

పెద్ద కొడుకు గిత్త మెడకు తాడు కట్టి, లాక్కురావాలని చూశాడు గాని, అది ఒక్క ఊపున దాన్ని తెంచి, దూరంగా పారిపోయింది. అప్పుడు కందస్వామి అక్కడ వున్న నాలుగు తాళ్ళను కొడుకులకు చూపి, వాటిని కలిపి పేనమన్నాడు. వాళ్ళు అలాగే చేశారు. ఈసారి అందరికన్న చిన్నవాడు పోయి, గిత్తను ఆ తాటితో కట్టి, గుమ్మం దగ్గిరకు లాక్కు వచ్చాడు.

కందస్వామి తన నలుగురు కొడుకులతో, "ఆ పొగరుపోతు గిత్త, జీవితంలో మీకు ఎదురయ్యే కష్టనష్టాలకు ప్రతిరూపం. ఒక్క తాడు దాన్ని లొంగదీసుకోలేనట్టే, మీరూ విడివిడిగా వాటిని ఎదుర్కోలేరు. ఈ సత్యాన్ని ఎన్నటికీ మరవకండి," అని చెప్పాడు.

—"కమలా పరమగురు"





# ఈర్ష్యాపరుడు

ఒక రాజు దగ్గిర సుంకన్న, వెంకన్న అనే తోటమాలీలు వుండేవాళ్ళు. ఒకనాడు సుంకన్న చెట్లపాదుల్లో నీళ్లు పోస్తూండగా, ఏదో తళతళమంటూ మెరిసింది. అతడు దాన్ని పైకి తీసి చూశాడు. అది ఒక బంగారు హారం. కాని, కొన్నాళ్ళుగా మట్టి అడుగున పడివుండడంతో, అక్కడక్కడ మకిలపట్టి వున్నది.

సుంకన్న హారాన్ని నీళ్ళతో శుభ్రంగా కడిగి, రాజుగారి దగ్గిరకు పోయి, తనకు హారం ఎలా దొరికిందీ విన్నవించు కున్నాడు. రాజు దాన్ని అంతఃపురానికి తీసుకుపోయి అరాతీయగా, అది కొంత కాలం క్రితం తన కుమార్తె పోగొట్టుకున్న హారమని తేలింది.

రాజు సుంకన్న నిజాయితీని మెచ్చు కుని, నౌకర్లందరి ఎదటా అతడికి నూరు బంగారువరహాలు బహూకరించాడు.

సుంకన్నను రాజుగారు అందరి ఎదటా గొప్పగా ప్రశంసించడం, బహుమానం యివ్వడం వెంకన్నకు చాలా బాధ కలిగించింది.

వెంకన్న చెప్పలేనంత ఈర్ష్యా పరుడు. తోటమాలీ పనికిగాను రాజుగారు యిచ్చే జీతం డబ్బులతో, సుఖంగా జీవితం జరిగిపోతున్నా, అతడికి ఏదో విధంగా రాజుగారిని మెప్పించి, వీలయితే ఆస్థానంలోనే పెద్ద ఉద్యోగం సంపా యించాలనే ఆశ వుండేది. కాని, వాడికి ఏనాడూ రాజుగారి ఎదట పడేందుకు అవ కాశం చిక్కలేదు.

"రాజుగారితో ఒక్కసారి నేను మాట్లాడే వీలు చిక్కితే, ఆయన్ని నా తెలివి తేటలతో మెప్పించి, ఏ ఆస్థాన ఉద్యోగినో అయిపోగలను. ఈ తోటమాలీ పని ఎన్నాళ్ళు చేస్తే మాత్రం ధనమా,

కారుమూరి సత్యనారాయణ

కీర్తా!" అంటూండేవాడు వెంకన్న భార్యతో.

ఇప్పుడు రాజుగారు సుంకన్నను మెచ్చుకుని నూరు వరహాలు బహూకరించడంతో, వెంకన్న మనసులో రకరకాల ఆలోచనలు మెదిలినై.

వాడు ఆరోగ్యం సరిలేదని ఉద్యోగానికి ఒక వారం రోజులు సెలవు పెట్టి, దీర్ఘంగా ఆలోచించి, తిరుగులేదని భావించిన ఒక పథకం వేశాడు.

ఆ ప్రకారం వాడు భార్యకు నచ్చజెప్పి, ఆమె మెడలో వున్న గొలుసును ఉద్యానవనంలోని ఒక చెట్టు పాదులో పూడ్చిపెట్టాడు. తరవాత నాలుగు రోజులు ఆగి, దాన్ని రాజుగారి దగ్గరకు తీసుకుపోయి, తనకది ఉద్యానవనంలో దొరికిందని చెప్పాడు.

రాజు, రాణీ దగ్గిరకు పోయి, కోపంగా, "మీ ఆడవాళ్ళకు యీ మధ్య అతిగా మతిమరుపు పట్టినట్టుంది. ఉద్యానవనంలో యిలా అడపాదడపా నగలు పారేసుకోవడం ఏమిటి?" అన్నాడు.

రాణి గొలుసును అంతఃపురంలోని ఆడవాళ్ళందరికీ చూపింది. వాళ్ళు మాది కాదంటే మాది కాదన్నారు.

రాజు ఆశ్చర్యపోయి, మర్నాడు ఆస్థాన స్వర్ణకారుణ్ణి పిలిపించి, గొలుసును పరీక్ష చేసి చూడమన్నాడు.

స్వర్ణకారుడు దాన్ని పరీక్షించి చూసి, "మహారాజా, ఈ నగ చాలా కల్తీ



బంగారంతో చేయబడింది. ఇది తమ అంతఃపురంలోని వారిదై వుండే అవకాశం లేదు," అన్నాడు.

రాజు ఆలోచనలో పడ్డాడు. ఉద్యాన వనంలోకి అంతఃపుర స్త్రీలు తప్ప బయటి వారెవరూ వచ్చే అవకాశంలేదు. ఇందులో తన తోటమాలి వెంకన్న ఎత్తుగడ ఏమన్నా వున్నదా అన్న అనుమానం ఆయనకు కలిగింది.

ఆ రాత్రి రాజు నియమించిన భటు డొకడు వెంకన్న ఇంటికి కాపలా వేశాడు. ఒక అర్ధరాత్రి వేళ లోపల భార్యాభర్తల మధ్య పెద్దగా కీచులాట ప్రారంభమైంది.

"వద్దన్నా వినకుండా, నా మెడలో గొలుసు కాస్తా, రాజుగారి కిచ్చావు. మరి ఆయన బహుమతి యిచ్చేదెప్పుడు ?" అని వెంకన్న భార్య కోపంగా భర్తను అడిగింది.

"అంత వేగిరపడకు ! ఆయన తీరని పనుల్లో మునిగివుంటాడు. గొలుసు అంతః పురంలో ఎవరిదీ కాదని తెలుసుకున్నాక, దాన్ని ఖజానాకు పంపి, నాకు సుంకన్న కన్న రెట్టింపు బహుమానం యిస్తాడు. అదృష్టం బావుంటే, మరేదైనా పెద్ద ఉద్యోగం కూడా యివ్వవచ్చు," అన్నాడు వెంకన్న.

భటుడు ఉదయానే, యీ సంగతి రాజుగారికి చెప్పాడు. రాజు వెంకన్నను పిలిపించి, "నీకు దొరికిన గొలుసు అంతఃపురంలో గదులు ఊడ్చే పని మనిషిదని తెలిసి, యిచ్చేశాము. ఆవిడ నీ ధర్మబుద్ధికి మెచ్చి, తన తాహతుకు తగిన బహుమానం పంపింది. ఎక్కడది ?" అంటూ పక్కన వున్న భటుడి కేసి చూశాడు.

భటుడు లోపలి గదుల్లోకి పోయి, ఒక సరికొత్త చీపురుకట్ట తెచ్చి, వెంకన్నకు యిచ్చాడు.

వెంకన్న నివ్వెరపోయి, ఒకటి, రెండు క్షణాల తరవాత తెప్పరిల్లి, రాజుకు నమస్కరించి, తల వంచుకుని ఇంటి దారి పట్టాడు.



# వేషం - గుణం

శృంగేరిదేశంలో ఒకప్పుడు దారిదోపిడీ దొంగల బాధ మితిమీరిపోయింది. వాళ్ళను పట్టుకునేం దుకు విఫలుడైన కొత్వాలు, రక్షకభటులకు దొంగల్లా పాగా తలకట్లూ, చురకత్తులూ యిచ్చి, అసలు దొంగలను పట్టుకోమన్నాడు.

అదే సమయంలో దొంగల నాయకుడు తన అనుచరులకు, రక్షకభటుల వేషాలు వేస్తే, మరింత తేలిగ్గా దొంగతనాలు చేయవచ్చని భావించి, వాళ్ళచేత రక్షకభటుల వేషాలు వేయించాడు.

ఒక రోజు అడవిదారిలో వాళ్ళూ, వీళ్ళూ తారసపడ్డారు. దొంగల వేషాలలో వున్న రక్షక భటులు, రక్షకభటుల వేషాలలో వున్న దొంగలను, "ఈ రోజు ఎవరైనా దొరికారా?" అని అడిగారు.

ఆ ప్రశ్నకు రక్షకభటుల వేషాలలో వున్న దొంగలు, "ఎవరూ దొరకలేదు. మీ సంగ తేమిటి?" అన్నారు.

"మాకూ అంతే!" అన్నారు దొంగల వేషాలలో వున్న రక్షకభటులు.

తరవాత ఎవరిదారిన వాళ్ళు వెళ్ళిపోయారు. రక్షకభటులు తమ కొత్వాలును కలుసుకుని, తాము ఆ రోజున అరణ్యమార్గంలో కొందరు రక్షకభటుల్ని చూశామని చెప్పారు.

కొత్వాలు ఆశ్చర్యపోతూ, "మీరు తెలివితక్కువ దద్దమ్మలు. వాళ్ళు నిజంగా రక్షక భటులైతే, దొంగలవేషంలో వున్న మిమ్మల్ని పట్టుకునేవాళ్ళు కాదా? వాళ్ళు మారు వేషాల్లో వున్న దొంగలు," అన్నాడు.

దొంగల నాయకుడు కూడా తన అనుచరులు చెప్పింది విని, "చవటవెధవల్లారా! మీరు చూసింది, దొంగల వేషాల్లో వున్న రక్షకభటుల్ని. అలా కాకపోతే, రక్షకభటుల వేషంలో వున్న మిమ్మల్ని చూసి పారిపోయేవాళ్ళు. వేషాలు మార్చుకున్నా, వాళ్ళ గుణాలూ, మన గుణాలూ మాత్రం మారలేదు," అన్నాడు.

—కోలార్ కృష్ణఅయ్యర్





# అపూర్వనయనాలు

కూనేరు రైతు శివన్న కొడుకు వల్లయ్యకు, రెండేళ్ళ వయసులోనే బాగా మాటలు వచ్చినై. ఒకనాడు వాడు తండ్రి చేతిలోని డబ్బీని చూసి, ''డబ్బు! డబ్బు!'' అన్నాడు.

అందులో నిజంగానే డబ్బులున్నవి. ఈ సంగతి కుర్రవాడికి ఎలా తెలిసిందో శివన్నకు అర్థం కాలేదు. ఆ సమయంలో శివన్న భార్య సీతమ్మ వంట గదిలోంచి వచ్చి, కొడుకును ఎత్తుకున్నది.

వల్లయ్య గోడ పక్కన వున్న ఒక కొయ్య పెట్టెను చూపుతూ, ''పాము! పాము!'' అనడం ప్రారంభించాడు. భార్యా, భర్తలిద్దరూ మొదట కంగారు పడి, తరవాత ఆశ్చర్యపోతూ చూసేంతలో, పెట్టె మూత కదలడం కంటబడింది.

శివన్న పెట్టెను వీధిలోకి తీసుకుపోయి, దాన్ని బోర్లా పడవేసి, కర్రతో సిద్ధంగా నిలబడ్డాడు. పాత బట్టల్లోంచి పామొకటి బయటికి వచ్చింది. శివన్న దాన్ని కర్రతో కొట్టి చంపేశాడు.

డబ్బీలోని డబ్బుల విషయం, పెట్టెలోని పాము సంగతీ వల్లయ్య చెప్పడంలో, ఏదో విశేషం వున్నదనిపించింది, శివన్నకు. వల్లయ్య చూడకుండా బెల్లం ముక్క గుప్పెట్లో పెట్టుకుని, ''ఇందులో ఏముంది?'' అని అడిగాడు.

''బెల్లం,'' అన్నాడు వల్లయ్య.

కొడుకును ఏదో శక్తి ఆవహించిందనుకున్నారు, భార్యాభర్తలు. ఇంతలో వల్లన్న, ''గేదె! గేదె!'' అనసాగాడు.

గదిలో గేదె ఏమిటా అని ఆశ్చర్యపోతూ శివన్న బయటికి వెళ్ళి చూశాడు. గోడ అవతల గేదె ఒకటి నిలబడి వున్నది. దానితో, శివన్నకు కొడుకు కళ్ళలో ఏదో శక్తి వున్నదని బోధపడిపోయింది. ఇటు

ఎస్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి

వంటి శక్తివల్ల ధనం సంపాదించడం సులభం అని భార్యాభర్తలు కూడబలుక్కుని, వల్లయ్య విషయం ఎవరికీ తెలియకుండా జాగ్రత్త పడ్డారు. వాళ్ళు, కుర్రవాణ్ణి ఒంటరిగా ఎక్కడికీ పోనిచ్చే వారు కాదు. వాడి కళ్లకు గంతలు గట్టి, ఎదురుగా వున్న వస్తువులూ, గోడ అవతల వున్న వాటి గురించీ తెలుసుకుని తృప్తి పడుతూండేవారు.

ఈ విధంగా ఒక సంవత్సరం గడిచింది. ఒకనాడు శివన్న నలుగురినీ కలుసుకుని, తన కొడుకు చేత ఒక వింత ప్రదర్శన చేయించనున్నట్టు చెప్పాడు. జనం వచ్చారు. వల్లయ్య కళ్ళకు గంతులు కట్టారు. జనం పిడికిళ్ళలో, జేబుల్లో, తలపాగాలలో దాచిన వస్తువులు, తప్పు పోకుండా చెప్పేశాడు వల్లయ్య.

వల్లయ్య అద్భుత శక్తిని గురించి, ఆ నోటా, ఆ నోటా పొరుగు గ్రామాలకు తెలిసింది. వల్లయ్య శక్తిని ప్రదర్శించడానికి కొంత రుసుం వసూలు చేస్తూ, శివన్న గ్రామాల వెంట తిరగసాగాడు. ఈ విధంగా అతడు కొద్ది నెలల్లోనే బాగా ధనవంతుడైపోయాడు.

ఒకనాటి రాత్రి శివన్న బస చేసిన సత్రంలో దొంగలు పడి, వల్లయ్యను



ఎత్తుకుపోయారు. ధనం ముట్టుకోని దొంగలు, వల్లయ్యను ఎత్తుకుపోవడంలోని రహస్యం తెలియక శివన్నా, అతడి భార్యా దుఃఖించసాగారు. ఆ సమయంలో వాళ్ళకు రాజుగారి నుంచి కబురు వచ్చింది.

భార్యాభర్తలు నగరానికి పోయి, రాజును దర్శించి, జరిగినదంతా చెప్పుకుని, కళ్ళనీళ్లు పెట్టుకున్నారు.

రాజు వాళ్ళను ఓదార్చుతూ, "మీ గురించి నేను లోగడే విన్నాను. కాని, ఇంతకాలంగా యిదేదో గారడీ అనుకుని, నమ్మలేదు. మీ అబ్బాయికి వున్న శక్తిని, తమ స్వార్థానికి ఉపయోగించుకోవచ్చు

నని, దొంగలు ఎత్తుకుపోయి వుంటారు. మీ వాడి కోసం వెతికిస్తాను,'' అన్నాడు.

ఇది జరిగిన కొద్దిరోజుల తరవాత, ఒక వర్తకుడు నౌకర్లతో అడవి మార్గాన ప్రయాణం చేస్తున్నాడు. దారిలో దొంగల గుంపొకటి వాళ్ళను అటకాయించింది. వాళ్ళ నాయకుడు ఎక్కి వున్న గుర్రం మీద, ఒక పిల్లవాడు కూడా వున్నాడు.

దొంగల నాయకుడు, వర్తకుడి నౌకర్లు మోస్తున్న కొన్ని పెట్టెలను పిల్లవాడికి చూపుతూ, ''ఆ పెట్టెల్లో ధనం వున్న పెట్టె ఏది ?'' అని అడిగాడు.

పిల్లవాడు నౌకర్లలో ఒకణ్ణి చూపిస్తూ, ''అతని తల మీద వున్న పెట్టెలో నగలున్నవి,'' అన్నాడు.

దొంగల నాయకుడు ఆజ్ఞాపించగానే, అతడి అనుచరులు ఆ పెట్టె తీసుకుని, అక్కణ్ణించి బయలుదేరారు. కాని, వాళ్లు తమ స్థావరం చేరాక, ఆ పెట్టెలో వున్నవి నకిలీ నగలని దొంగల నాయకుడు తెలుసుకున్నాడు.

వాడు పట్టరాని కోపంతో పిల్లవాడికేసి చూస్తూ, ''ఒరే, వల్లయ్యా ! ఇంత గొప్ప శక్తులున్న నీ కళ్ళకు ఏది బంగారమో, ఏది నకిలీదో తెలియదన్న మాట, ఛీ !'' అన్నాడు.

అంతలో రాజభటులు దొంగల స్థావరాన్ని చుట్టుముట్టారు. అంతకు ముందు వర్తకుడి వేషంలో వున్న సేనానాయకుడు శూరవర్మ, దొంగలను లొంగిపోవలసిందిగా



అజ్ఞాపించి, వాళ్ల నాయకుడితో, "ఒరే, రంగన్నా! ఎంతో అనుభవంగల నువ్వే, వర్తకుడి వేషంలో వున్న సేనానాయకుణ్ణి గుర్తించలేకపోయావు! చాటుగా వెంబడించి, నీ స్థావరం తెలుసుకునేందుకే, యింతకుముందు నిన్ను బంధించకుండా వదిలాను," అన్నాడు.

అధిక సంఖ్యలో వున్న రాజభటుల్ని చూసి, దొంగలు నోరెత్తకుండా లొంగిపోయారు. శూరవర్మ వాళ్ళను తాళ్ళతో కట్టించి, వల్లయ్యను గుర్రం మీద ఎక్కించుకుని, నగరం చేరాడు.

రాజు రఘువర్మ, శివన్న దంపతులను పిలిపించి, "మా భటులు, మీ కుర్రవాణ్ణి దొంగల బారినుంచి రక్షించి తెచ్చారు. రాజ్యంలో మరికొన్ని దొంగల ముఠాలున్నవి. ఈసారి మరొక ముఠా వాళ్ళు మీ వాణ్ణి ఎత్తుకుపోయే ప్రయత్నం చేయవచ్చు. అందువల్ల, వల్లయ్య మా రక్షణలోనే పెరుగుతాడు. మీరు వారానికొకసారి వచ్చి, కొడుకును చూసి వెళ్ళవచ్చు," అన్నాడు.

శివన్న దంపతులు అందుకు ఒప్పుకున్నారు. వల్లయ్య కోటలో ఇరవై సంవత్సరాల వయసు వాడయ్యేవరకూ పెరిగాడు. రాజు రఘువర్మ మరణించగా, ఆయన కుమారుడు శక్తివర్మ రాజయాడు.

శక్తివర్మ ఒకనాడు వల్లయ్యను పిలిచి, "ఇంతకాలం నువ్వు మా రక్షణలో పెరిగావు. చదువు సంధ్యలతోపాటు, యుద్ధ





విద్యలు కూడా నేర్చావు. బతుకు తెరువు చూసుకోవాలి గదా; ఏం చేయాలను కుంటున్నావు ?'' అని అడిగాడు.

వల్లయ్య ఒక క్షణం ఆలోచించి, "మహా రాజా, తమరు అనుమతించితే, కొంత కాలం పాటు దేశసంచారం చెయ్యాలని వున్నది,'' అన్నాడు.

శక్తివర్మ సరేనని, వల్లయ్యకు కొంత డబ్బిచ్చాడు. వల్లయ్య దేశాటన చేస్తూం డగా, ఒక గ్రామంలో తీవ్ర జ్వరానికి గురయ్యాడు. అతడు వైద్యుణ్ణి చూడ బోయిన సమయంలో, జగన్నాథం అనే ఆ వైద్యుడు కడుపు నొప్పితో బాధపడు తున్న ఒక రోగిని పరీక్షిస్తున్నాడు.

'' అంతగా పరీక్షించనవసరం లేదు. రోగికి కడుపులో ఎడమ వైపున కురుపు వుంది,'' అన్నాడు వల్లయ్య.

'' మీరు వల్లయ్యగారనుకుంటాను ?'' అన్నాడు వైద్యుడు.

అవునన్నాడు, వల్లయ్య. వైద్యుడు, వల్లయ్యను తన ఇంటనే వుంచుకుని, ఒక వారం రోజులపాటు శ్రద్ధగా మందు లిచ్చాడు. ఈ సమయంలో వల్లయ్య రోగాలను గుర్తించేందుకు వైద్యుడికి బాగా సాయపడ్డాడు.

జ్వరం నయం కాగానే వల్లయ్య రాజ్య సరిహద్దు ప్రాంతానికి వెళ్ళాడు. అక్కడ ఒక ఉద్యోగి సరిహద్దు దాటి వచ్చిన ధాన్యం బస్తాల బళ్ళ వివరాలు రాసు కుంటున్నాడు.

వల్లయ్య ఒక బండికేసి చేయిచూపుతూ, '' అయ్యా, ఆ ధాన్యంబస్తాలలో, ధాన్యం మధ్య రత్నాలు వున్నవి,'' అన్నాడు.

ఉద్యోగి చిరాకుపడుతూ, ''జాగ్రత్తగా పరీక్షించాకే, అవన్నీ ధాన్యం బస్తాలని తేల్చుకున్నాం. నువ్వెవడివి, వల్లయ్యలా!'' అన్నాడు.

'' నేను వల్లయ్యనే!'' అన్నాడు వల్లయ్య శాంతంగా.

ఆ పేరు వింటూనే ఉద్యోగి కంగారు పడిపోయి, తన నౌకర్ల చేత ధాన్యం బస్తా

లలో వెతికించగా, చాలా రత్నాలు బయట పడ్డాయి. అతడు వల్లయ్యకు క్షమాపణ చెప్పుకుని, అక్రమంగా రత్నాలను రాజ్యం నుంచి తరలిస్తున్న వర్తకుణ్ణి బంధించాడు.

వల్లయ్య అక్కణ్ణించి బయలుదేరి, కొన్నాళ్ళకు రాజధానీ నగరం చేరి, రాజు శక్తివర్మను చూడబోయాడు.

"చాలా కాలం దేశాటన చేశావు! ఇప్పుడు, ఏ వృత్తిలో కుదురుకోవాలని నిశ్చయించుకున్నావు?" అని అడిగాడు, రాజు వల్లయ్యను.

"మన సరిహద్దు ప్రాంతాల అటూ, యిటూ చాలా దొంగ రవాణా జరుగుతున్నది, మహారాజా! నా బోటి వాడికి దాన్ని అరికట్టడం చాలా సులభం. నాకా ఉద్యోగం యిప్పించండి," అన్నాడు వల్లయ్య.

"అవును, అది నీ శక్తికి తగిన ఉద్యోగం. పనిలో పనిగా నువ్వుండే చోట ఒక వైద్యశాల కూడా నిర్మించదలిచాను. అక్కడి వైద్యులకు, నువ్వు లోగడ ఒక గ్రామంలో వైద్యుడొకడికి సాయం చేసినట్టే, చేస్తూ వుండు. రోగులు త్వరగా కోలుకుంటారు," అన్నాడు శక్తివర్మ.

వల్లయ్య ఆశ్చర్యపోతూ, "నేను ఫలానా గ్రామంలోని ఒక వైద్యుడికి సహాయం చేసినట్టు, మీకెలా తెలిసింది?" అని అడిగాడు.

రాజు నవ్వి, "నీ అపూర్వనయనాల విలువ, నీ కన్న యితర్లకే మరింత బాగా తెలుసు! ఈ దేశాటన సమయంలో, నిన్ను మరొక దొంగల ముఠా ఎత్తుకుపోకుండా రక్షించేందుకు, నీవెంట కొందరు గూఢచారులను పంపాను," అన్నాడు.

కొద్దిరోజుల తరవాత రాజు, వల్లయ్యను సరిహద్దు ఉద్యోగిగా నియమిస్తూ ఉత్తరువులు పంపాడు. వల్లయ్య తన గ్రామంలోని దగ్గిర బంధువుల పిల్లను వివాహమాడి, తల్లిదండ్రులతో సహా రాజ్యసరిహద్దులకుపోయి, అక్కడే స్థిరపడి, చాలా కాలం సుఖంగా జీవించాడు.



# తెలివైనవాడు

విదర్భరాజుకు తాను చాలా తెలివైనవాడిననే భ్రమ వుండేది. అందువల్ల ఆయన అప్పుడప్పుడూ సభికుల్ని అర్థం పర్థం లేని ప్రశ్నలడుగుతూండేవాడు. ఒకసారి ఆయన సభికులతో, "ప్రపంచంలో అందరికన్న తెలివైనవాడెవరో చెప్పగలిగినవాడికి, వెయ్యి వరహాలు బహుమానం యిస్తాను," అన్నాడు.

చాలామంది రాజు పేరు చెప్పారు. "పేరు చెబితే చాలదు, ఉదాహరణలు కావాలి," అన్నాడు రాజు. అప్పుడు విదూషకుడు లేచి, "చిన్నప్పుడు మా నాన్న ఒకసారి నాతో, ఒక ప్రశ్నకు జవాబు చెప్పగలవాడే, ప్రపంచంలో అందరికన్న తెలివైనవాడనిపించుకుంటాడు, అన్నాడు," అని చెప్పాడు. రాజుతో సహా అందరూ కుతూహలంగా, ఏమిటా ప్రశ్న అని అడిగారు.

"మనిషి శరీరానికి చావుంది కాని, ఆత్మకు లేదు కదా. మనం దుస్తులు మార్చినట్టుగా ఆత్మ శరీరాన్ని మారుస్తూంటుంది. అయితే, ఒక శరీరాన్ని వదిలిపెట్టిన ఆత్మ, ఇంకో శరీరంలో ప్రవేశించబోయే ముందు, ఎంతకాలం విశ్రాంతి తీసుకుంటుంది, అన్నది మా నాన్నగారి ప్రశ్న," అన్నాడు విదూషకుడు.

ఈ ప్రశ్నకూ ఎవరూ జవాబు చెప్పలేకపోయారు. రాజు, విదూషకుణ్ణే జవాబు చెప్పమన్నాడు. విదూషకుడు దీనంగా ముఖం పెట్టి, "మా నాన్న, నా కొక్కడికే జవాబు చెప్పాడు. ఆ జవాబు మా వంశంలో వాళ్ళకు తప్ప, మరెవరికీ చెప్పగూడదన్న శాపం వున్నది. మా నాన్న జీవించి లేడు. ఇక ఆ ప్రశ్నకు జవాబు తెలిసినవాణ్ణి నేనొక్కణ్ణే కనక, ప్రపంచంలో అందరికన్న నేనే తెలివైనవాణ్ణి," అన్నాడు.

రాజు కోపంగా, "నీకన్న తెలివైనవాళ్ళే లేరా, ప్రపంచంలో?" అన్నాడు.

"అదేమిటి, మహారాజా! నా అంత తెలివైనవాణ్ణి విదూషకుడి పేరుతో తమరు సేవకుణ్ణి చేసుకోగలిగారంటే, నా కన్న తెలివైనవాళ్ళనే గదా అర్థం!" అన్నాడు విదూషకుడు.

రాజు సంతోషపడి, విదూషకుణ్ణి తెలివిగలవాడివని మెచ్చుకుని, వెయ్యి వరహాలు బహుమతి యిచ్చాడు.

—జొన్నలగడ్డ రామలక్ష్మి





# విఘ్నేశ్వరుడు

కృష్ణుడిమాటలకు నవ్వి, మృదంగ కేసరి, "అలాగని తప్పించుకోబోతున్నావా ? వీల్లేదు ! నీ మురళీగానం గొప్పదో, నా మృదంగ వాయిద్యం గొప్పదో ఇప్పుడే తేలిపోవాలి !" అన్నాడు.

కృష్ణుడు గడగడలాడుతూ, ఊదడానికి మురళి తీశాడు. మృదంగకేసరి మఠం వేసి మద్దెల వాయించ మొదలు పెట్టాడు. కృష్ణుడు యమునాకళ్యాణి రాగాన్ని వాయిస్తూ మృదంగకేసరిని తికమక పెట్టి తక్కున హంసధ్వని రాగాన్ని అందుకొని అద్భుతంగా వాయిస్తూంటే, మృదంగకేసరి పరవశించి మైమరిచి మద్దెల విడిచి నృత్యం చేయడం మొదలు పెట్టాడు.

కృష్ణుడు హంసధ్వని రాగాన్ని చిత్ర విచిత్ర గతులతో స్వరాలు మరింత దురితంలో పలికిస్తూంటే, మృదంగకేసరి రూపు విడిచి విఘ్నేశ్వరుడు విఘ్నేశ్వరుడై తొండమెత్తి, బొజ్జ ఊపుకొంటూ తాండవం చేశాడు. మద్దెల మాయమై ఎలుకగంతులు వేసింది.

విఘ్నేశ్వరుడు తనకు ప్రియతమమైన హంసధ్వని రాగానికి పులకరించిపోతూ, తాండవం చేస్తూ అలసిపోతూంటే కృష్ణుడు తక్కున మురళి వాయించటం ఆపి, విఘ్నేశ్వరుడు పడిపోకుండా ఒడిసి పట్టుకొని, "పార్వతీనందనా ! మళ్లీ బోర్ల పడ్డావంటే, మీ అమ్మ మురళీగానాన్ని వినకూడదని శపించి పోతుందేమోనన్న



భయంతో, నిన్ను కింద పడిపోకుండా పట్టుకున్నాను, మరేం అనుకోకు, లంబోదరా!'' అన్నాడు.

విఘ్నేశ్వరుడు, ''కృష్ణా, నీ మురళీ గానాన్ని వినాలనే ఇలా వచ్చాను. మన కృష్ణవినాయకీయం నిజంగా సుందర కాండే!'' అన్నాడు.

కృష్ణుడు, ''విఘ్నేశా! పాపం, నీ వాహనం మద్దెలదరువులు బాగా తిన్నదే!'' అని అంటూ ఎలుకను ముద్దుగా నిమిరాడు.

విఘ్నేశ్వరుడు, ''కృష్ణా! కంసుడికి అంత్యకాలం సమీపించింది. ధనుర్యాగం సాకుతో నిన్ను తీసుకురమ్మని, అక్రూరుణ్ణి పంపుతాడు, వెళ్ళు! విజయోస్తు!'' అని చెప్పాడు.

కృష్ణుడు, ''అంతా నీ దయ, స్వామీ!'' అని చేతులు మోడ్చి మ్రొక్కాడు.

విఘ్నేశ్వరుడు, ''అవతారమూర్తివి! నా దయ కాదు, నీ లీల! అన్నట్టు అర్క కుబ్జ రూపంతో నీ కోసం ఎదురు చూస్తూంటుంది, అనుగ్రహించు!'' అని చెప్పి ఎలుక వాహనం ఎక్కి, ఆకాశానికి రివ్వున వెళ్లి అంతర్ధానమయ్యాడు.

అక్రూరుడు కృష్ణబలరాములను మధురాపురానికి రథం మీద తీసుకు వెళ్ళాడు. అష్టవంకరలతో ఉన్న కుబ్జ కృష్ణుడికి ఎదురొచ్చి, పాదాలకు మ్రొక్కి చందనం పూసింది. కృష్ణబలరాములకు పూలమాలలు వేసింది.

కృష్ణుడు ఆప్యాయంగా కుబ్జను రెండు చేతులతో లేవనెత్తాడు. కుబ్జ రూపం పోయి అప్సరసరూపంతో అర్క దేవలోకం చేరుకుంది.

కంసుడు తనను చంపాలని చేసిన కపటోపాయాలన్నిటినీ చిత్తు చేసి, కృష్ణుడు, కంసుణ్ణి పట్టుకుని సింహాసనం నుంచి ఈడ్చిలాగాడు. కంసుడు మరణించాడు.

దేవకీ వసుదేవులను కారాగార విముక్తులను చేసి, కృష్ణుడు ఉగ్రసేనుడిని

కూడా కారాగారం నుండి విడిపించి, అతని సింహాసనం అతని పరం చేశాడు.

కృష్ణబలరాములు పెద్దవాళ్ళయ్యారు. కృష్ణుడు అనేకమంది దుర్మార్గులను, రాక్షసులను నిర్మూలించాడు. సముద్రం లోకి చొచ్చుకొని దుర్భేద్యంగా ఉండేలాగ ద్వారకానగరాన్ని నిర్మాణం చేయించి, అన్న బలరాముణ్ణి యాదవులకు పెద్దగా చేసి రాజరికాన్ని నెలకొల్పాడు.

కృష్ణుడు రుక్మిణిని తెచ్చుకొని వివాహం చేసుకొన్నాడు.

సర్వసంపదలతో తుల తూగుతున్నా, కృష్ణుడు ఎప్పటివలెనే ఆవులను కాస్తూ, పాలు పితుకుతూ గోపాలకృష్ణుడుగానే ద్వారకలో ఉంటున్నాడు.

ద్వారకానగరం పక్కనే సత్రాజిత్తు అనే ప్రముఖుడు రాజువలె సంస్థానం ఏర్పరచుకొని భోగభాగ్యాలతో తులతూగు తున్నాడు. తాను సూర్యవంశ క్షత్రియు డనని సగర్వంగా చెప్పుకుంటూ, సూర్యో పాసకుడై గొప్ప తపస్సు చేశాడు. సూర్యుడు ప్రసన్నుడై శమంతకమణి అనే పెద్ద వజ్రాన్ని అతనికి ప్రసాదిం చాడు. శమంతకమణి నుండి వెలువడే కాంతి కిరణాలు బంగారు కణికలై ప్రతి రోజూ అతనికి అంతులేని బంగారం సమకూరుతూండేది.



సత్రాజిత్తు ప్రముఖులనిపించు కుంటున్న వారికి ఆహ్వానాలు పంపి మరీ వచ్చినవారందరికీ మణినిచూపించి, మణి ప్రభావాన్ని వర్ణిస్తూ మురిసిపోతూండేవాడు. కృష్ణుడికి కూడా ఆహ్వానం పంపించాడు గాని కృష్ణుడు రాలేదు, ఎప్పుడో వీలు చూసుకొని వస్తానని తిరుగు కబురు పంపించాడు. గర్విష్ఠి అయిన సత్రాజిత్తు కృష్ణుడిపై ద్వేషం పెట్టుకున్నాడు. కృష్ణుడి గురించి ఎన్నో విశేషాలు విన్నా, ఒక యాదవ ప్రముఖుడిగా తప్పితే కృష్ణుడిపై అతనికి పెద్ద అభిప్రాయం ఏర్పడలేదు.

సత్రాజిత్తుకు సత్యభామ అనే అసమాన సౌందర్యవతియైన కుమార్తె ఉన్నది.



తన ఆశ ఫలింపజేయమని మరీ మరీ ధ్యానిస్తూండేది.

సత్రాజిత్తుకు కుమార్తె మనసు తెలిసినా తెలియనట్టే ఉండేవాడు. ఒకనాడు సత్య విఘ్నేశ్వరుడి ముందు మోకరిల్లి ఉండగా చూసి, "ప్రత్యక్ష దైవమైన సూర్యభగవానుడి అనుగ్రహం మనపై ఉండగా, ఇలాంటి మొక్కుబడులు దేనికమ్మా?" అన్నాడు.

సత్యభామ చివాలున లేచి, "అలా అనకూడదు, నాన్నా! మనోవాంఛితాన్ని సఫలం చేయగల దేవుడు విఘ్నేశ్వరుడు ఒక్కడే!" అన్నది.

"ఏమిటి నీ మనోవాంఛితం? రుక్మిణితో పాలు పంచుకోవడమేనా?" అన్నాడు సత్రాజిత్తు.

"పాలు పంచుకోవడమేమిటి? కృష్ణుణ్ణి నా అధీనంలో పెట్టుకొంటాను!" అన్నది సత్యభామ.

సత్యభామ పట్టుదల ఎలాంటిదో సత్రాజిత్తుకు తెలియనిది కాదు. అయినా వక్ర బేల అని తనకు తాను సరిపెట్టుకొంటూ వెళ్లాడు.

మర్నాడే కృష్ణుడు సత్రాజిత్తు దగ్గిరికి వచ్చాడు. రాక రాక వచ్చిన కృష్ణుడి కళ్ళ పడాలని సత్య సంబరపడుతూ ముస్తాబు సవరించుకొని సభామందిరానికి

శమంతకమణితో బాటు సత్యభామ సౌందర్యం కూడా విఖ్యాతి కెక్కింది; జరాసంధుడిలాంటి రాజాధిరాజులు సైతం సత్యభామను చేబట్టాలని కాచుకొని ఉన్నారు.

సత్యభామకు విఘ్నేశ్వరుడిపై ఎనలేని భక్తి విశ్వాసాలున్నవి. ఆమె ప్రతి వినాయక చవితికి విఘ్నేశ్వరుణ్ణి భక్తి శ్రద్ధలతో పూజించి కృష్ణుణ్ణి తన అధీనుడిగా చేయవలెనని కోరుకుంటూండేది. కృష్ణుడు ఆ దారిన వచ్చినప్పుడల్లా సౌధాగ్రంమీద నిల్చుని చూసి చూసి, ఒకసారైనా అతడు తలపైకెత్తి తన్ను చూడలేదుకదా అని నిరాశతో విఘ్నేశ్వరుడి ముందు మోకరిల్లి,

వెళ్ళేసరికి కృష్ణుడు అప్పుడే వెళ్ళిపోయాడు. సత్రాజిత్తు శమంతకమణిని గుప్పెట్లో భద్రంగా పట్టుకొని ఉగ్రంగా కృష్ణుడు వెళ్ళిన వేపే చూస్తూ ఎంతోదిగులుగా నిల్చున్నాడు.

సత్యభామ తండ్రితో, "ఏమిటి నాన్నా అలాగ ఉన్నారు? వచ్చిన వాడు నన్ను తనకు యిమ్మని అడగలేదు గద!" అన్నది.

"అలా అడిగినా నేనంతగా పట్టించు కోను గాని, ఏమడిగాడో తెలుసా? శమంతకమణిని యిమ్మన్నాడు. తన లాంటి వాడి దగ్గిర ఉంటే, ప్రజలందరి శ్రేయస్సుకీ ఎన్నోవిధాల ఉపయోగపడుతుందని కూడా అన్నాడు!" అని సత్రాజిత్తు చెప్పాడు.

సత్యభామ చిరుకోపంతో, "ఇంతకూ, నా కంటే శమంతకమణే నీకు ఎక్కువైనది కదూ?" అంటూ చరచర వెళ్ల బోతూంటే సత్రాజిత్తు బుజ్జగింపుగా, "అలా అనుకోవద్దమ్మా! ఆ కృష్ణుడి పేరాసకు విస్తుబోతున్నాను, అంతే!" అంటూ నసిగాడు.

"అతడు మణి యిచ్చే బంగారాన్ని దాచుకుంటానని అనలేదుగదా, అతనిది పేరాస ఎలా అవుతుంది, నాన్నా? కృష్ణుడంతటివాడు అడిగినప్పుడు సంతోషంతో



యిచ్చి వేస్తే ఎంత బాగుండేది, నాన్నా!" అన్నది సత్యభామ.

సత్రాజిత్తు కంపించిపోతూ, "ఇవ్వను, ప్రాణాలతో ఉండగా నా దగ్గిర్నుంచి మణిని ఎవ్వరూ తీసుకోలేరు! మణి నా ప్రాణం, నా సర్వస్వం!" అంటూ గట్టిగా అరిచాడు.

సత్యభామ ముఖం జేవురించుకొని, "ఔను! మణి నీకు అంత గొప్పది! నా కంటే గొప్పది! ఆ శమంతకమణి గొప్పదో, నేను గొప్పో ఆ కృష్ణుడే రుజువు చెయ్యాలి!" అంటూ చరచరా వెళ్లింది.

కొద్ది రోజుల తరవాత వినాయక చవితి వచ్చింది. సత్యభామ యథావిధిగా విఘ్నే



శ్వరుణ్ణి అర్చించి, ఆ సాయంత్రం పల్లకిలో ద్వారకానగరానికి బయలుదేరి వెళ్లింది.

ఆ సాయంత్రం ఆకాశం దట్టంగా మబ్బు పట్టింది. చీకటి అవుతున్నది. కృష్ణుడు ఆవుపాలు పితుకుతున్నాడు. ఒక్కసారిగా మబ్బు విడిపోయి చవితి చంద్రవంక పాలల్లో తళుక్కున ప్రతిబింబించి కృష్ణుడికి కనిపించి క్షణంలో మబ్బుక్రమ్మి మాయమైంది.

వినాయక చవితినాడు చంద్రుడు కంటబడినందుకు కృష్ణుడు నొచ్చుకుంటూ, పూజా మందిరంలోకి వెళ్లి అక్షతలు తల మీద చల్లుకొని, విఘ్నేశ్వరుని ముందు నిల్చుని కన్నులు మూసి, "దేవా! ప్రతిబింబమే అయినా చూశాను, అంతా నీ దయ!" అని ధ్యానించాడు. అతను అలా ధ్యానిస్తున్నప్పుడు "కృష్ణా! నీవు చూడాలని చూడలేదుగా! నీలాపనింద పడినా మబ్బు విడిపోయినట్లే విడిపోతుంది! ఇదీ ఒక లాభానికే అనుకోవయ్యా!" అంటూ విఘ్నేశ్వర ప్రతిమలోంచి వెలువడినట్లుగా మాటలు వినిపించాయి.

కృష్ణుడు కన్నులు తెరిచి, "స్వామీ! అంతా నీ లీల!" అన్నాడు.

అదే సమయంలో రుక్మిణి పూజా మందిరం ప్రవేశిస్తూ విఘ్నేశ్వరుని ముందు నిల్చుని ఏదో జపిస్తున్న కృష్ణుణ్ణి ఆశ్చర్యంతో చూసి, "శ్రీవారు విఘ్నేశ్వరులవారితో ఏదో మంతనాలు జరుపుతున్నట్లున్నదే!" అన్నది.

కృష్ణుడు, "ఇదే వేళ ఒకానొక వినాయకచవితినాడు నన్ను పెంచిన యశోదమ్మతో నేను అన్న మాటలు గుర్తుకొచ్చాయి, అంతే!" అన్నాడు.

"ఆ ముద్దుమాటలేమిటో నాకు కూడా వినిపించవా, స్వామీ!" అన్నది రుక్మిణి.

కృష్ణుడు, "యశోదమ్మ పితుకుతున్న పాలలో చవితి చంద్రుడి బింబం చూసి కేరింతాలు కొట్టాను. ఎన్ని నిందలు

పడతావో కదా, అని యశోదమ్మ నొచ్చుకున్నది. పెద్దయ్యాక అయినా నింద తప్పదన్నది. దానికి నేను, అమ్మా, అప్పుడు మళ్ళా చూడాలికదూ అని అన్నాను.'' అని చెప్పాడు.

రుక్మిణి, ''మరి అప్పుడు నీలాపనింద సంగతి ఏమైంది?'' అనడిగింది.

''మన్ను తింటున్నానని అన్నయ్య చెప్పనే చెప్పాడు!'' అన్నాడు కృష్ణుడు.

రుక్మిణి, ''మళ్లీ ఇప్పుడు చంద్రుణ్ణి చూడలేదుకద! చూడాలన్నా కనిపించదు లెండి, బాగా మబ్బుపట్టి ఉంది!'' అని అంటూ ఏదో చెప్పబోతున్నట్లు చూసింది.

''రుక్మిణీ! ఏదో చెప్పవచ్చినట్టున్నావే, ఏమిటి విశేషం?'' అనడిగాడు కృష్ణుడు.

''విశేషమే! సత్రాజిత్తులవారి ఇంటి మణి మన ఇంటికి విచ్చేసింది!'' అన్నది రుక్మిణి.

కృష్ణుడు, ''శమంతకమణి మన ఇంటికి రావడమేమిటి?'' అన్నాడు ఆశ్చర్యంగా.

''ఆ మణికాదు. సత్రాజిత్తులవారి కన్యకామణి-సత్యభామామణి వచ్చింది. చాలాసేపుగా ఇక్కడే మాట్లాడుకుంటూ ఉన్నాము. చూసి చూసి ఇప్పుడే పల్లకిలో వెళ్లింది. ఆమెను సాగనంపి ఇలా వచ్చాను. మీరు కనిపించారు!'' అన్నది రుక్మిణి

కృష్ణుడు తలపంకించి, ''అలాగా! మన ఇంటి విఘ్నేశ్వరదేవుణ్ణి కూడా చూడాలని వచ్చి ఉంటుంది, చూసింది కదా!'' అన్నాడు.

రుక్మిణి, ''విఘ్నేశ్వర దేవుణ్ణి చూడాలని వచ్చిందో, మీ కన్నుల్లో పడాలని వచ్చిందో మరి! ఇక్కడ వున్నంతసేపూ ఆమె చూపులు మిమ్మల్నే తెగ వెతికి వెతికి వేసారాయని మాత్రం నాకు రూఢిగా తెలుసు!'' అన్నది.

''ఏమిటీ వింత! మాటలు రావనుకున్న రుక్మిణీదేవి, ఈ రోజు చతురంగా మాట్లాడుతున్నదే!'' అని కృష్ణుడు అన్నాడు.






# గంధర్వ చక్రవర్తి కూతురు

## 4

అక్క వద్దన్న పని చేసినందుకు చివాట్లు తగులుతాయని హసన్ అనుకున్నాడు. అయితే అతని అక్క అతన్ని పల్లెత్తు మాట కూడా అనకపోగా అతని స్థితికి జాలిపడి, "నువు అధైర్యపడకు. నీవు ప్రేమించిన కన్య నీకు దక్కేటట్టు నా శాయశక్తులా ప్రయత్నిస్తాను. అయితే నీ రహస్యం నా మిగిలిన అక్కలకు ఏ మాత్రమూ తెలియనివ్వకు. తెరవరాని తలుపు మాట వస్తే అది ఎక్కడ ఉన్నదీ కూడా నీకు తెలియదని చెప్పు. ఎందుకిలా కృశించిపోయావని అక్కలు ప్రశ్నిస్తే, 'మీ కోసం బెంగపడి ఇలా అయాను,' అని జవాబు చెప్పు," అని సలహా ఇచ్చింది.

తరవాత ఆమె తన అక్కలతో, "పాపం, హసన్ ఒంటరిగా ఉండి, మన కోసం బెంగపడి మంచాన పడ్డాడు. అతనికి తన తల్లీ, ఊరూ జ్ఞాపకం వచ్చి, భరించరాని వేదన కలిగిందట!" అన్నది.

ఇది విని రాజకుమార్తెలు ఎంతో నొచ్చుకుని అతని వద్దకు వచ్చి ఎన్నో రకాల ఉపచారాలు చేశారు; అతనిచేత ఆహారం తినిపించారు; తమ తండ్రి దేశంలో చూసిన వింతలన్నీ అతనికి చెప్పారు.

ఈ విధంగా ఒక నెల రోజులపాటు వారు అతనికి ఉపచారాలు చేయగా హసన్ కొంతవరకు కోలుకున్నాడు.

తరవాత ఒకనాడు రాజకుమార్తెలందరూ వేటకు బయలుదేరారు. కడగొట్టు రాజకుమార్తె హసన్‌కు తోడుగా ఉంటానని ఉండిపోయింది. మిగిలిన వాళ్ళు వెళ్ళగానే ఆమె హసన్‌ను సరస్సు సమీపంలో ఉన్న ఉద్యానవనంలోకి



తీసుకుపోయి. ''చూడు, హసన్! ఈ సరస్సు పక్కన అనేక స్నాన ఘట్టాలున్నాయి. నీకు కనిపించిన కన్యలు ఎక్కడ స్నానం చేశారు?'' అని అడిగింది. హసన్ ఆమెకు సింహాసనం ఉన్న చోటు చూపించాడు.

ఆమె వెలవెలబోతూ, ''అరి, భగవంతుడా! నువు చూసిన కన్యలు గంధర్వ చక్రవర్తి కూతుళ్ళు, ఆమె చెలికత్తెలూ. ఆ చక్రవర్తి కింద మా నాన్న ఒక చిన్న సామంతు మాత్రమే. నీవు ప్రేమించినది చక్రవర్తి అఖరు కుమార్తె అయి ఉంటుంది. గంధర్వ చక్రవర్తి ఉండే లోకానికి మానవులే కాదు, ఇతర గంధర్వులు కూడా వెళ్లలేరు. నీవు చూసిన గంధర్వ చక్రవర్తి కూతురు ప్రతి అమావాస్యకూ తన చెలికత్తెలతోసహా ఇక్కడికి ఎగిరివచ్చి జలకాలాడి పక్షి తొడుగుల సహాయంతో తమ లోకానికి తిరిగిపోతుంది. ఆ తొడుగును చేజిక్కించుకుంటే తప్ప ఆమె నీకు దొరికే మార్గం లేదు. అందుచేత ఆమె ఇంకొకసారి వచ్చేదాకా ఇక్కడ పొంచి ఉండి, ఆమె సరస్సులో జలకాలాడే సమయంలో ఆమె తొడుగును దొంగిలించు. ఆమె దానిని ఇవ్వమని ఎంత దీనంగా బతిమాలినా నువు చలించకు. చలించిపోయి ఆమెకా తొడుగు ఇచ్చేశావో నువూ, నీతోబాటు మేమూ, మాతోబాటు మా నాన్నా, అందరమూ సర్వనాశనం కావటం నిశ్చయం. నువు గుండె రాయి చేసుకుని ఆమెను జుట్టు పట్టుకుని జరజరా ఈడ్చుకు వచ్చెయ్యటం ఉత్తమమైన పని. అలా చేస్తే ఆమె నీకు లొంగి వస్తుంది. ఆ తరవాత ఏమవుతుందో చూద్దాం,'' అని సలహా యిచ్చింది.

హసన్ ఈ మాటలు విని ఆనందంతో తన్మయుడైపోయాడు.

మర్నాడు అమావాస్య. చీకటి పడగానే హసన్ సరస్సు వద్దకు వెళ్ళి మెట్ల సమీపంలో దాక్కున్నాడు. కొంచెంసేపయాక చక్రవర్తి కుమార్తే, ఆమె చెలికత్తెలూ

ఎగురుతూ వచ్చి వాలి, తమ పక్షి ఉడుపులు తీసేసి నీటిలోకి దిగారు. హసన్ దడదడలాడే గుండెతో ఆ ఉడుపులను సమీపించి, తన ప్రియురాలి ఉడుపు సంగ్రహించి, మళ్ళీ వెళ్ళి దాక్కున్నాడు.

కొంతసేపయాక చక్రవర్తి కూతురు నీటి నుంచి పైకి వచ్చి, తన ఉడుపు మాయం కావటం గమనించి, గట్టిగా కేకలు పెట్టసాగింది. ఆమె చెలికత్తెలు ఈ కేకలు విని నీటి నుంచి పైకి వచ్చి జరిగిన సంగతి తెలుసుకున్నారు. తెలుసుకున్న వాళ్ళు తమ యజమానురాలిని ఆపదలో ఆదుకోవటానికి బదులు, బెదిరిపోయిన వాళ్ళలాగా, ఎవరి ఉడుపులు వారు ఆదరా బాదరా తొడుక్కుని, రివ్వున ఆకాశంలోకి ఎగిరిపోయారు.

చక్రవర్తి కూతుర్ని హసన్ సమీపించాడు. కాని అతన్ని చూడగానే ఆమె సరస్సు గట్టున పడి పరిగెత్తసాగింది. అతను ఆమెను వెంబడించాడు. చివరికతను ఆమెను అందుకుని, ఆమె జుట్టు తన చేతిలో మెలివేసి పట్టుకుని తన వెంట నడిపించాడు. ఆమె కళ్ళు మూసుకుని, ఏ మాత్రమూ పెనుగులాడక అతను నడవమన్నట్టు నడిచింది. హసన్ ఆమె కన్నీటిని గాని, ఆక్రందనాన్ని గాని పాటించకుండా, గుండె రాయి చేసుకుని, ఆమెను తన



గదికి తెచ్చి, తలుపు బీగంవేసి, ఈ సమాచారం తన అక్కతో చెప్పాడు.

చక్రవర్తి కూతురు తన గదికి చేరినట్టు హసన్ చెప్పగానే అతని "అక్క" ఆమె వద్దకు వెళ్ళి, ఆమె పాదాలపైన పడి, "మహారాణీ, తమ రాకవల్ల మా మందిరం పావనమయింది," అన్నది.

విచార సాగరంలో ఉన్న చక్రవర్తి కుమార్తె తల ఎత్తి ఆమెను చూసి, "నీవేనా? మానవమాత్రుడెవడో నీ ప్రభువు కుమార్తెను ఇలా అవమానించటానికి అవకాశం ఇస్తావా? అసలు ఒక మనిషిని నీ యింట ఎలా చేరనిచ్చావు? ఏమి నీ ధైర్యం? నీ సహకారం లేకుండానే అతను



నా సరస్సు వద్ద పొంచి ఉండి నన్ను పట్టగలుగునా ?'' అన్నది.

హసన్ అక్క, ''దేవీ, ఈ యువకుడైనా సామాన్యుడు కాడు. అతనికి ఈడొచ్చే మానవమాత్రుడు లేడు. అతని శీలం అత్యద్భుతమైనది. అతని మనసులో దురుద్దేశం మచ్చుకైనా లేదు. విధి ప్రేరితుడై అతను నిన్ను గాఢంగా ప్రేమించటం జరిగింది. దైవనిర్ణయాన్ని ఎవరు మార్చగలరు ? ప్రేమికులు క్షంతవ్యులు. అతను నిన్ను మొదటిసారి చూసినాక ప్రేమోపహతుడై ప్రాణాలు వదిలే దశకు వచ్చాడంటే నమ్ము ! నీ వెంట సాటిలేని అందగత్తెలు మరి తొమ్మిది మంది ఉన్నప్పటికీ అతని మనసును నీవు మాత్రమే ఆకర్షించగలిగావు,'' అన్నది.

ఈ సంగతి విన్నాక చక్రవర్తి కుమార్తె తనకు విమోచనం ఉండదని గ్రహించి ఒక్క నిట్టూర్పు విడిచింది.

హసన్ అక్క ఆమెకు మంచి దుస్తులు కట్టబెట్టి, భోజనం వడ్డించి, ఆమె విచారాన్ని తగ్గించటానికి చేయదగిన ప్రయత్నాలన్నీ చేసింది. చివరకు చక్రవర్తి కుమార్తె, ''నాకు మా తండ్రి నుంచీ, జన్మస్థలం నుంచీ ఎడబాటు విధించి ఉన్నది కాబోలు! విధిని ఎలా తప్పించుకోవటం?'' అన్నది.

తమ చక్రవర్తి కుమార్తెకు కొంత ఉపశమనం కలిగించి అక్క హసన్ వద్దకు వచ్చి, ''నీ ప్రియురాలి మనసును నీకేసి తిప్పుకో. ఆమెకు చూపవలిసిన మర్యాదలన్నీ చూపు. మాట్లాడేటప్పుడు సౌజన్యం ప్రదర్శించు,'' అని హెచ్చరించింది.

హసన్ చక్రవర్తి కుమార్తె వద్దకు వచ్చి ఆమె ఎదట నిలబడగానే చక్రవర్తి కూతురు అతన్ని ఆపాదమస్తకమూ పరిశీలించి, అతని అపూర్వ సౌందర్యం గమనించి కొంతవరకు మెత్తబడింది. హసన్ ఆమెతో, ''రాజకుమారీ, నేను నీకు బానిసలాంటి వాణ్ణి. ఏ విధంగానూ నిన్ను బలాత్కరించాలనే ఉద్దేశం నాకు

ఏ కోశానా లేదు; శాస్త్రవిధి ననుసరించి నిన్ను వివాహం చేసుకోవాలనే నా కోరిక. పెళ్ళి అయినాక మనము నా జన్మస్థల మైన బాగ్దాదు నగరానికి పోదాము. నీకు కావలసినంతమంది దాస దాసీలను ఏర్పాటు చేస్తాను. అక్కడ మా అమ్మ ఉన్నది. ఆమెను మించిన యోగ్యురాలు ప్రపంచంలో ఉండబోదు. ఆమె నిన్ను తన కుమార్తెలాగా చూసుకుంటుంది. ఆమె వంట అద్వితీయమైనది; నీకు దివ్య మైన భోజనం చేసి పెడుతుంది,'' అన్నాడు.

చక్రవర్తి కుమార్తె అతనికి జవాబు ఏమి చెప్పేదోగాని ఈ లోపుగా ముఖ ద్వారం తట్టిన చప్పుడు వినపడింది. అది తెరిచే పని తనది కావటంచేత హసన్ పరిగెత్తి వెళ్లి తలుపు తెరిచాడు. వచ్చిన వారు పెద్ద అక్కలు. వారు ఆరుగురూ వేట నుంచి తిరిగివచ్చి, హసన్‌లో కలిగిన మార్పు గమనించారు. హసన్ వారితో చక్రవర్తి కుమార్తె విషయం చెప్పక, వారు కొట్టి తెచ్చిన వేటలన్నిటినీ లోపలికి చేర వేశాడు.

పెద్ద అక్క అతన్ని చూసి, ''ఏం, హసన్? ఇవాళ చాలా ఉత్సాహంగా ఉన్నావు! అని అడిగింది. హసన్ సిగ్గుపడి, అప్పుడే వచ్చిన చిన్న అక్కకేసి, ''నువు చెప్పు!'' అన్నట్టుగా చూశాడు.

''మరేమీ లేదు. మన హసన్ ఇవాళ ఒక పిట్టను పట్టుకున్నాడు. దాన్ని మచ్చిక చేసి పెట్టాలి,'' అన్నది చిన్నక్క.

''ఈ భాగ్యానికే సిగ్గుపడి పోతాడేం?'' అన్నది పెద్దక్క.

''అతనికా పిట్ట మీద ఎంత ప్రేమో చెప్పతరం కాదు,'' అంటూ ఆమె తన అక్కలకు జరిగిందంతా చెప్పేసింది వారందరూ వెంటనే చక్రవర్తి కూతురున్న చోటికి వెళ్ళి ఆమెకు జోహార్లు చేసి, హసన్‌ను పెళ్ళాడమని ఆమెను ప్రోత్స హించారు. వారే హసన్ చేతిలో ఆమె చెయ్యి పెట్టి పాణిగ్రహణం కూడా చేశారు. —(ఇంకా వుంది)



## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1982 మార్చి నెల సంచికలో ప్రకటింపబడును.



M. Natarajan





D. R. Mohan Rao

- ★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)
- ★ జనవరి నెల 20 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరవాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.
- ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/–లు బహుమానం.
- ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి:–చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26

---

## నవంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: ప్రయాణంలో అన్నీ చింతలే!

రెండవ ఫోటో: పసివానికి అన్నీ వింతలే!

**పంపినవారు :** బి హెచ్. వి. యల్. నరసింహారావు, చీరాల.

*బహుమతి మొత్తం రు. 25/–నెలాఖరులోగా పంపబడుతుంది.*

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.



# చందమామ

పాఠకులందరికీ

నూతన సంవత్సర

శుభాభినందనలు



# చందాదారులకు గమనిక

'చందమామ' కాపీలు పంపుటకు మీ చిరునామాలో ఏదైనా మార్పుంటే 5-వ తేది లోగానే, మీ చందా నంబరు ఉదహరిస్తూ మాకు తెలపాలి, ఆలస్యమైతే మళ్ళీ నెల వరకు మీ క్రొత్త అడ్రసును అమలు పెట్టడానికి వీలుండదు.

డాల్టన్ ఏజన్సీస్
'చందమామ బిల్డింగ్స్'
మదరాసు - 26



67 66
Ravi




ఆవేళ రాజుయొక్క చిట్టి చెల్లెలు మీనా పుట్టిన రోజు.
ఆది రాజుకి గొప్ప సంతోషాన్నిచ్చే శుభ సమయం.
నందు, వినయ్, రేఖ, అశోక్ -అందరూ అందమైన కానుకలను తెస్తామన్నారు.
రాజుకి ఏం కానుక యివ్వాలో తోచలేదు.
అతను చాలా, చాలా చాలా ప్రత్యేకమైన కానుకను ఇవ్వాలనుకున్నాడు. ఆలోచించాడు, ఆలోచించాడు, ఆలోచించాడు ఏమివ్వాలా అని.
ఉన్నట్టుండి అతనికి ఓ అయిడియా తట్టింది.
ఆ! ముసుగు. అందంగా, రంగులుచిందే ముసుగుపైన పచ్చని దారలు, బుగ్గలపై గులాబిరంగు, కెంపువన్నె పెదవులు—ఒక్క క్షణంలో కార్డ్‌బోర్డ్ మీద బ్రష్‌తో ముసుగు బొమ్మను పెయింట్ చేసి, ముసుగులా ఉండేలా కత్తిరించాడు.
అబ్బ ఎంత అందమైన కానుక, అది చూసి మీనా మురిసిపోయింది.
ప్రతివారూ రాజు గురించి, రాజు ఇచ్చిన అద్భుతమైన కానుక గురించే మాట్లాడారు.
మరి రాజు అలా పెయింట్ చేయగలిగితే మీరూ చెయ్యగలరు మరి.

# కెమెల్

## వాటర్ కలర్స్ & పోస్టర్ కలర్స్






కేమ్లిన్ ప్రైవేట్ లిమిటెడ్
ఆర్ట్ మెటీరియల్స్ డివిజన్ జె.బి. నగర్
బొంబాయి 400 059.



కేమ్లిన్ అన్‌బ్రేకబుల్ పెన్సిళ్ళ ఉత్పాదకులనుండి

VISION 791TEL